ఓ౩మ్

# వైదిక
# క్రాంతి పథం

(వేదోక్త పురోగమన మార్గం)



వైదిక క్రాంతి పథ ప్రదర్శకుడు

**మహర్షి దయానందుడు**


సంకలన కర్త :

**డా॥ కోడూరి సుబ్బారావు**



ప్రకాశకులు :

**గాయత్రీ ఆశ్రమము**

వ్యాస్ వైదిక సేవా సమాజము, వ్యాస్‌నగర్, సికింద్రాబాద్ - 500 061.

గాయత్రీ ప్రచురణ - 11

ప్రథమ ముద్రణము - 1000 ప్రతులు

ద్వితీయ ముద్రణము - 1000 ప్రతులు

సృష్టి సంవత్సరము : 197, 29, 49, 097

దయానందాబ్దము : 172

శ్రీ ధాత నం॥ ఆషాఢ పౌర్ణమి, (1996)

**మూల్యము : రూ. 15.00**

(పోస్టు ఖర్చులు అదనము)

ప్రతులకు :

1) గాయత్రీ ఆశ్రమము,
12-10-586/6, హ్యూస్‌నగర్ (మేడిబావి),
సీతాఫలమండి, సికింద్రాబాద్ - 500 061.

2) వైదిక సాహిత్య భండార్,
ఆర్యసమాజము, సుల్తాన్ బజార్,
హైదరాబాద్ - 500 195.

3) శ్రీ మాశెట్టి శ్రీనివాస్ ఆర్య,
స్వస్తిక్ మెటల్ ప్రొడక్ట్స్, 3-3-738,
కంసరి బజార్, సికింద్రాబాద్ - 500 003.

4) శ్రీ ఆర్. కృష్ణమూర్తి, బుక్‌సెల్లర్స్,
ఆర్యసమాజ మందిరము, మెయిన్ రోడ్డు,
సీతాఫలమండి, సికింద్రాబాద్ - 500 061.

*Designed & Printed at :* **PRINTSHOP**, Secunderabad.
✆ : 812904/818296

# విషయ సూచిక

# ఓమ్

# ప్రకాశకీయము

'వైదిక క్రాంతి' పథం అని నామకరణం చేయబడిన ఈ గ్రంథం పునర్ముద్రణ గావించబడినది. మొదటి ముద్రణలో వ్యవధిలేని కారణంగా ఎక్కువ దృష్టి సారించని విషయ విపులీకరణపై ఈ ద్వితీయ ముద్రణలో శ్రద్ధ వహించటం జరిగినది. గాయత్రీ ఆశ్రమట్రస్టు వ్యవస్థాపకులు, స్వయంగా ఈ గ్రంథ సంకలన కర్తయైన శ్రీ డా. కోడూరి సుబ్బారావుగారు ఈ రెండవ ముద్రణలో వైదిక సిద్ధాంతములను చదువరులకు మరింత సులభంగా బోధపడే విధంగా సంస్కరించిరి. మా యీ గాయత్రీట్రస్టు ఆదర్శవంతమైన ఉద్దేశ్యాలతో ఏర్పడినది. గ్రామములలో నివసించే పేదప్రజలకు సహాయమొనర్చుట, ఆర్షగురుకులాలలో శిక్షణపొందే పేద విద్యార్థినీ విద్యార్థులకు ఆర్థికంగా సహాయపడుటతోపాటు వేద ధర్మములను రాష్ట్రమంతటా తెలుగులో వ్యాపింపజేయుటకు అనువైన గ్రంథముద్రణ - ప్రచారములు మా ట్రస్టు యొక్క ఉన్నత ఆశయాలు. మా యీ చివరి ఆశయం నెరవేరుటకై ఈ గ్రంథం అత్యధికంగా తోడ్పడుతుందని మా ఉద్దేశ్యం.

ఈ గ్రంథమును సర్వాంగసుందరంగా ముద్రించి యిచ్చిన ప్రింట్‌షాప్, సికింద్రాబాద్ వారికి మా ధన్యవాదములు.

శ్రీ ధాతనామ సం॥ర
జ్యేష్ఠ పౌర్ణమి.

**సంధ్యావందనం శ్రీనివాసరావు**
కార్యదర్శి - గాయత్రీ ఆశ్రమట్రస్టు

# క్రాంతి రస్తు

వెలుతురంత పోస్తుంటే వెర్రెందుకు హెచ్చెనంట
కిరణ తాపమవుతుంటే క్రిములెన్నో చచ్చునంట

ప్రాణశక్తి నిస్తుంటే పడిపోతా రెందుకంట
పారు నీటిలో చేపకు నోరెండుక పాయెనంట!

ప్రమాణాన్ని విడిచిపెట్టి పలుపోకడ పోతారా
ప్రతి క్షణాన్ని మిడిసికొట్టి పాపులుగా పుడుతారా!

విజ్ఞానం పేర నేడు అజ్ఞానం పెరుగుతుంది
విశ్వశాంతి పేర నేడు వినాశనం జరుగుతుంది

మూఢమతుల అడుగుజాడ మోక్షానికి కాదు నీడ
శాశ్వత సత్యాలతోడ "సైన్సు" సాక్ష్యమిచ్చె నేడ?

–రామబాణం

మనకు, నవ సమాజానికి, మహా ప్రపంచానికి వేదమే ప్రమాణం. అది ఈశ్వర నిర్దేశం– ఈశ్వరాదేశం. మానవులకు కర్తవ్యం.

4,32,000 సంవత్సరాల కాల పరిమితి గల ఈ కలి యుగంలో ఇప్పటికి 5090 సం॥లు గడిచి పోయినాయి. గడిచిన ఈ కొద్ది కాలంలో మహర్షి దయానంద సరస్వతి మాత్రమే మళ్లీ మహోన్నత సత్యార్థ ప్రకాశం గావించారు.

ఆ వెలుగు రుచిగొన్న కొందరే అతని మార్గదర్శనాన్ని కొసరు కొన్నారు. ఆ కొసరును స్పర్శించిన కొందరిలో ఆత్మీయులు శ్రీ కోడూరి సుబ్బారావు

గారొకరు. మౌనంగా మునివృత్తి గడుపుతూ కలం నడుపు తున్నారు. వైదిక క్రాంతి పథాన్ని దర్శింపజేస్తున్నారు.

నేను సాహిత్యంలో ప్రతిపాదించే జాతీయ విప్లవం వైదిక క్రాంతియే– అందుకే ఆ కలం నా కలం కలిసిన బలం– జ్ఞానఫలం.

ఇప్పుడు చదువుల నిండ భ్రాంతి– పెదవుల నిండ భ్రాంతి
ప్రజాజీవనం భ్రాంతి–ప్రజాస్వామ్యమే పెద్ద భ్రాంతి
పార్టీ– పదవులెల్ల భ్రాంతి– ప్రధానమంత్రియే భ్రాంతి
మతాలు మనోగతాలు భ్రాంతి– వాదాలు నినాదాలు భ్రాంతి

ఈ భ్రాంతి కంతా కారణం ఇంద్రియ దోషపూరితమైన, సంస్కార దోష ప్రేరితమైన, విషాదభరితమైన నేటి విద్య. దీనికై లక్షలాది కోట్ల రూపాయలు వ్యయమైనా ఒక్కడూ ఋషి కాలేడు - కాజాలరు. ఒక్కడూ మహాపురుషుడు కాలేడు - కాజాలడు. భ్రాంతి వల్ల భ్రాంతియే ఫలితం. ఇక క్రాంతి ఎక్కడ?

చీకటినే మేసి మేసి చీకటి రుచిగొన్న వాళ్ళకు వెలుగు రుచి తెల్పాదు.

వెలుగు చీకటి తెలిసీ వేదార్థం రాసుకొండు
కాదను వాడెవడున్నా కదనానికి రమ్మన్నా!

ఆ వెలుగే వేదం- సత్యం- జ్ఞానం- ధర్మం- అదే క్రాంతి. భ్రాంతిమయ జీవనులకు వైదిక క్రాంతి పథమే నిర్భ్రాంతం- నిర్మల శాంతం.

ఈ లఘు సంకలనంలో సరళ వ్యాఖ్యానయుక్తంగా పది మంత్రాలున్నాయి. త్యాగి- పురుషార్థి- వివేకి- అద్వేష్టి- మధురభాషి- ప్రచేతనుడు- ఋణ విముక్తుడు- వ్రతశీలుడు- మననశీలుడు- సంఘటకుడు అగుటయే మానవుడు.

రాష్ట్రపతి- రాష్ట్రపిత- రాష్ట్ర చాచా- ప్రధానమంత్రి- డాక్టర్- యాక్టర్- రియాక్టర్- ప్రొఫెసర్- చాన్సలర్- సైంటిస్టు- జడ్జి- బ్యాడ్జి- లాయర్ మున్నగు వాళ్ళుగా అవుతున్నారే గానీ మానవుడుగా కావడం లేదే. ఇది కానిదెల్ల నిష్ఫలం.

పై వాళ్లెవరైనా ఈ గ్రంథంలోని పది మంత్రాలలో ఒక్కటి పాటించగలరా?

అందుకే వేదం "మనుర్భవ" అంటున్నది. ఆ తర్వాతనే మిగతవన్నీ కమ్మంటున్నది. మానవ నిర్మాణం గురువు చేత- గురుకులాల్లో జరిగేది. నేటి విద్య వల్ల ఇది కాకుండా మిగతవన్ని కాగలుగుతున్నారు. భ్రష్టుల చేత బజారులో నిర్మూలనం జరుగుతున్నది. శాంతి - క్రాంతి ప్రశ్నార్థకం?

నామమాత్ర మానవులారా! మానవులు కండి. కనీస మీ వైదిక క్రాంతి పథాన్ని నెమరు వేయండి. కండ్లు తెరవండి. దీక్ష పూనండి. సత్యవ్రత మాచరించండి. ఈ ఆచరణయే అన్నింటికి పరిష్కారం. శ్రీ కోడూరి వారి కోరిక ఇదే ఇదే- ప్రేరేపించు గాక!

ఓం శాంతిః శాంతిః శాంతిః

| | |
|---|---|
| కలి. సం. 5091 | సద్దర్శనాభిలాషి, |
| అశ్వీయుజ కృష్ణపక్ష విదియ | జాతీయ విప్లవకవి, |
| ఆర్షవేద గురుకులం | **యెల్దండ రఘుమన్న** |
| కానాపూర్ (గండిపేట) | (తెలుగు భాషోపన్యాసకులు, |
| రంగారెడ్డి జిల్లా | ఉస్మానియా విశ్వ విద్యాలయ కళాశాల, సికింద్రాబాద్) |

# ముందు మాటలు

మహర్షి దయానందుడు మరుగున పడిన వేద విద్యలను మరల వెలుగులోనికి తీసికొని వచ్చిన మహానుభావుడు. ఆయన అనుసరించిన మార్గమున ఆర్య విద్వాంసు లెందరో వేద విద్యలను విస్తృత పరచిరి. అందు పండిత గంగా ప్రసాద్ ఉపాధ్యాయ గారు ఒక విశిష్ట మణివలె ప్రకాశించు చుందురు. వారు గొప్ప ముని - మననశీలురు. మంత్రములోని పదముల యొక్క మూలార్థము వరకు వెళ్ళి అచట నుండి నేటి సామాజిక జీవన సరళికి అన్వయించు విధమున వాఖ్యానించు గొప్ప వ్యాఖ్యాతలు. వారి భావములనే అనుసరించుచు మరికొన్ని విషయములను చేర్చి కొన్ని ప్రేరణాత్మక వేద మంత్రములను వ్యాఖ్యానించుటకు ప్రయత్నించితిని. ఇవి బాల వాక్కులే అయినను బ్రహ్మ వాక్కులు (వేద వాక్కులు). వాటిని నా చిన్న మాటలతో తెలుగు పాఠకుల కనుకూలముగ వ్యవహార భాషలో వ్రాయుట జరిగినది. విద్వాంసులు ఇందు దోషములున్న తెలిపిన మలి ముద్రణలో సవరించు కొనగలను.

ప్రాచీన ఆంధ్ర కవితా వైభవ ప్రతిరూపముగ తిరుగాడుచు ఆంధ్రుల యువ హృదయాన్ని తట్టి లేపు జాతీయ విప్లవ కవీంద్రులు ఎల్దండ రఘుమన్న గారు నేను కోరిన వెంటే తొలిపలుకులు వ్రాసి యిచ్చిరి. వారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

40వ పుటలోని ధన ప్రశంస ధనము కూడా అవసరమైనదియేనని చెప్పుటకే కాని ధనమే సర్వస్వమని పాఠకులు పొరబడ రాదు. ధనము కన్న ధర్మమే సర్వ విధముల గొప్పది. ధనము ఒక సాధనము. పనిముట్టు. అది ధర్మాత్ముల చేతిలో లోకోపకారకమగును. అధర్మీయుల చేతులో లోకవినాశక హేతువగును. ఏది యేమైనా అవసరమునకు మించిన ధనము అనేక సమస్యలకు కారణమగును.

—కోడూరి సుబ్బారావు

ఓ3మ్

# వైదిక క్రాంతి పథం

మనము భారతీయులము, శాంతి కాముకులము. అంతేగాక, క్రాంతి కాముకులము కూడా. సామాన్య జనుల దృష్టిలో శాంతి, క్రాంతి రెండును వ్యతిరేక గుణములుగా కనబడును. శాంతిమార్గ మనగా మహాత్ముడు చూపిన సత్యాగ్రహ ఉద్యమములతో కార్యములను సాధించుట యనియు, క్రాంతిమార్గ మనగా తీవ్రవాదులు అవలంభించెడు విధ్వంసక చర్యలనియు భావము స్ఫురించును, కాని వేదశాస్త్రములలో వీని అర్థాలు వేరుగా చెప్పబడినవి. ఈ రెండు శబ్దములు వేర్వేరు ధాతువులతో నిర్మింపబడినను వీనిలోని ప్రత్యయము మాత్రము ఒక్కటియే. 'శము ఉపశమే' అను ధాతువుతో శాంతి పదము తయారగును. గాన శాంతి యనగా ఉపశమనము కలిగించునది యని అర్థము. సూర్యుడు శాంతి దాయకుడు కావలెననిన పూర్తిగా చల్లబడిపోవుట యని అర్థము కాదు. పూర్తిగా చల్లబడినచో మరియొక విధమైన బాధ కలుగును. అందుచేత సూర్యుని తాపము కొంతవరకు తగ్గి జీవులకు బాధ కలిగించని సుఖమునిచ్చు తాపమును కలిగియుండవలె నని యర్థము. అనగా న్యూనాధికములు లేని సుఖదాయకమగు నొక సమస్థితిని కలిగియుండుట. అవి జడపదార్థములుకాని, మానవ సమాజముకాని, దేశములుకాని కావచ్చును.

"క్రము పాదవిక్షేపే" అను ధాతువుతో క్రాంతి పదము తయారగును. క్రాంతి యనగా అడుగు ముందు కిడి పయనించుట యని అర్థము. లేదా పురోగమనము అని కూడా చెప్పవచ్చును. వేదము క్రాంతి మార్గములో పయనించుమని ప్రబోధించును. ఇది తీవ్రవాదమని పొరబడ రాదు. శాంతిని గోరువారు క్రాంతి మార్గమున నడువక తప్పదు. లోకములో దుష్టులు దుర్మార్గులు ఉన్నప్పుడు వారిని అణచి పెట్టనిదే శాంతి లభించదు. వేదము "విజానీహి ఆర్యాన్ ఏచ దస్య వః బర్హిష్మతే రంధయా శాసద అవ్రతాన్" అని

చెప్పును. ఆర్యులను (శ్రేష్ఠ మానవులను), దస్యులను (దుర్మార్గులను) విజానీహి - పొరబడకుండ చక్కగా వేరువేరుగా గుర్తించి, అవ్రతులైన దుర్మార్గులను రంధయ - అణచి పెట్టవలె నని వేదము చెప్పును. యజుర్వేదములోని పదునారవ అధ్యాయములో విశేషముగా నీ విషయము వర్ణింపబడినది- రాజులు, సైన్యాధ్యక్షులు, శత్రు మూకలను చెండాడి ప్రజలను రక్షించవలెననియు, రణభూమిలో రుద్రులై విహరించవలెననియు గొప్ప ప్రేరణ నిచ్చుచున్నది. ఏ రాజు అగ్నివలె దుష్టులను భస్మమొనర్చునో, చంద్రునివలె శ్రేష్ఠులకు సుఖమును చేకూర్చునో, న్యాయముగా దండించునో, రాజ్యమంతయు సంచరించి ప్రజల కష్టములను తెలిసికొనునో అట్టి రాజును, రాజ భృత్యులను మీరు సత్కరించి శాంతిని పొందుడను ప్రేరణ ఆ మంత్రములో గలదు.

కాని నేడు మనము రుద్రాధ్యాయమును అభిషేకాది క్రియలకు వాడుకొనుచున్నాము. సమస్త సత్య విద్యల నిలయమైన ఈశ్వరవాణియగు వేదమును చదివి అర్థము చేసికొని ఆ మార్గమున పయనించుటకు బదులుగా దానిని సస్వరముగా లేదా అనేక పాఠములుగా వల్లించుచు తృప్తి జెందుచున్నాము. క్రాంతి సామాజిక జీవనములో నిత్యము ఎంతైనా అవసరము. ఈ సమాజ వ్యవస్థను బాగుచేయవలెనని ఎంతో మంది మహానుభావులు వారికి తోచిన ఆలోచనలతో సంస్కరింప బ్రయత్నించిరి. కొంతవరకు సంస్కరించ గలిగిరి. అందు కొన్ని సంస్కరణలు మరికొన్ని మూఢనమ్మకాలకు దారితీసి సమాజమును మరింత దిగజార్చినవి. బుద్ధుడు ప్రబోధించిన అహింసా మార్గము చివరకు సమాజమును జడత్వస్థితికి తీసుకు వెళ్ళినది. ప్రజలు నాస్తికులై, ఇంద్రియ నిగ్రహమును గోల్పోయి శత్రువులను అణచలేక బానిసలై జీవించిరి. దీనికి కారణము వేదము చూపిన అహింసా మార్గము నవలంబింపక పోవుటయే. వేదముపట్ల, దైవముపట్ల ప్రజలకు నిరసన భావము కలిగినది. నిరసించవలసినది యజ్ఞ యాగాదులలోని హింసను కాని యజ్ఞయాగాదులను కాదు. అప్పటి నుండి వేదప్రచారము సన్నగిల్లి వేదము ఏమి చెప్పుచున్నదో యెవ్వరికీ తెలియకుండా పోయినది. వాటిని విదేశీయులు ఎత్తుకు పోయారని కూడా కథలు కథలుగా చెప్పుకొనిరి. అప్పటినుండి యిరువదవ శతాబ్దము వరకు

ఎంతమంది సంస్కర్తలు వచ్చినను తమకు తోచిన విధముగా సంస్కరించిరే కాని వేదోద్ధరణ జేసి వేదమార్గములో సమాజమును సంస్కరింప బ్రయత్నించలేదు.

20 వ శతాబ్దములో మహర్షి దయానందు డుద్భవించి-"ఒకప్పుడు మహోన్నత దశలో ప్రపంచమును పరిపాలించిన ఈ దేశము ఎందుకు ఈనాడు బానిసయై పరపరిపాలనలో మ్రగ్గుచున్నది? విదేశీయుల నుండి విద్యను సంస్కృతీ సభ్యతలను యాచిస్తూ దీనముగా గడుపుచున్నది ? ఈ పతనానికి కారణమేమి?" అని తీవ్రముగా నాలోచించెను. ఎందరో మహానుభావులను కలిసికొని, ఎన్నెన్నో గ్రంథములను చదివి, ఆసేతు హిమాచల పర్యంతము పర్యటించి, చివరకు వైదిక వ్యాకరణ భాస్కరునిగా ప్రసిద్ధి గాంచిన విరజానందుని వలన ఈ పతనానికి కారణము తెలిసికొనగల్గెను. వేదాన్ని అనుసరించక పోవుట వలననే ఈ పతనము కలిగెననియు, వేద ప్రచారము లేకపోవుటయే అనేక మూఢనమ్మకాలకు, అవినీతికి, అజ్ఞానానికి, దోపిడికి, సోమరి తనానికి కారణమనియు గ్రహించెను. వేదములను ప్రాచీన ఋషులు అర్థము చేసికొని బ్రాహ్మణాది గ్రంథములు రచించిన వేద వ్యాఖ్యాన పద్ధతిని విరజానందుని వలన గ్రహించెను. ఆ ఋషుల దృష్టితో వేదాధ్యయనము గావించెను. దానివలన వేదములలో ఆత్మ - పరమాత్మ విషయములే గాక ఎన్నెన్నో జ్ఞాన విజ్ఞాన విషయములు వారికి గోచరించెను. ప్రపంచములో ఈనాడు మనకు గనబడు సమస్త విజ్ఞాన శాస్త్రాలకు జెందిన మూల సూత్రములు వేదములందు గలవనియు, ఆ విజ్ఞాన సూత్రములనే ఋషులు మననము గావించి జ్యోతిష్యము, గణితము, ఖగోళ విజ్ఞానము మొదలగు శాస్త్రముల నెన్నింటినో రచించగలిగినారని గ్రహించెను. వేదము మానవ సృష్టికి ప్రారంభములో మానవులకు పరమేశ్వరుని ద్వారా లభించిన విజ్ఞాన భండారమని తెలుసుకొనెను:

నేడు లోకములో బహుళ ప్రచారము గావింపబడుచున్న డార్విన్ పరిణామ సిద్ధాంతము లోప భూయిష్టమైనది. పరిణామ సిద్ధాంతముతో మానవుడు అమీబా నుండి క్రమ పరిణామము జెందుచు కోతిగా, చివరకు మానవునిగా రూపొందలేదు. ఈ వివిధ జాతులన్నియు పూర్వము కూడా నుండెను.

ఇప్పుడును ఉన్నవి. మరి కొన్ని తరములు గడిచినను ఉండగలవు. మానవ విజ్ఞానము కూడా ప్రకృతిలోని జంతువులను, జడపదార్థములను అనుసరించి వృద్ధి జెందినది కాదు. ఏదో నిమిత్త కారణము వలననే మానవునకు జ్ఞానము లభించెను. "మాతృమాన్, పితృమాన్, ఆచార్యవాన్, పురుషో వేద" – ఆ నిమిత్త కారణము తల్లి, తండ్రి, గురువు, ఆచార్యులు నగుదురు. మానవ సృష్టికి ప్రారంభములో వీరెవ్వరు నుండరు గాన పరమేశ్వరుడే కారణమగును.

పరమేశ్వరుడు తాను నిర్మించిన సృష్టివిజ్ఞానమును, సృష్టిరహస్యములను, పదార్థములలోని గుణగణములను వేదము ద్వారా ఋషుల హృదయములలో ప్రకాశ పరచెను. అప్పటి నుండి నేటి వరకు ఆ విజ్ఞానము గురుశిష్య పరంపరగా వచ్చుచున్నది. ఆ వేదవిజ్ఞానము భ్రమ ప్రమాదములు లేని విశుద్ధ జ్ఞానము.

మహర్షి దయానందు డట్టి వేదవిజ్ఞాన మాధారముగా సమాజమును సంస్కరించి పూర్వపు టౌన్నత్య దశకు తీసికొని వెళ్లుటకు తీవ్రముగా యత్నించెను. ఆనాడు దేశములో నున్న యనేక సంప్రదాయములవారితో చర్చలు జరిపి రాజుల సహాయముతో శాస్త్రార్థములను (తర్కములను) ఏర్పాటుజేయించి ఆ సంప్రదాయ సిద్ధాంతములు వేదములకే గాక విజ్ఞానానికి, హేతువాదానికి, యుక్తికి గూడా నిలబడజాల వని నిరూపించెను. అంతటను మహర్షికే విజయము లభించెను. సంప్రదాయకులు వారి నమ్మకాలకు, సిద్ధాంతాలకు, కర్మ కలాపములకు వేదాధారము జూపించలేక పోయిరి. మహర్షి భారతీయ మత మతాంతరముల సమీక్షయే గాక క్రైస్తవ, మహమ్మదీయాది విదేశీ మతములను కూడా సమీక్షించి అవి కూడా విజ్ఞాన విరుద్ధములని నిరూపించెను. మహర్షిని శాస్త్రార్థములలో నోడించలేక యెన్నో మార్లు విషప్రయోగము గావించిరి. చివరకు చంప గలిగిరి. కాని దయానందుడు జూపిన వేదమార్గము, గ్రంథములు, వేద భాష్యము ఇప్పటికి గూడా అజ్ఞానమును పారద్రోలుచు సూర్యుని వలె స్వయం ప్రకాశకములై నిలిచియే యున్నవి. దయానందుని తరువాత యెట్లో మనకు స్వరాజ్యము లభించినది. కాని మన నాయకుల తొందరపాటు వలన దేశ విభజన జరుగుటయే గాక ఈదేశము ప్రజాస్వామ్య దేశముగా, మత నిరపేక్ష

దేశము (secular) గా మార్చి వేయబడినది. అందుచే విదేశీయులు వెళ్ళిపోయిరే కాని విదేశీ మిషనరీలు పోలేదు. ఈ దేశములో నెవరి మతమును వారు ప్రచారము చేసికొను పూర్ణ స్వాతంత్ర్యము గలదు. ప్రజాస్వామ్యమగుట వలన అల్పసంఖ్యాక వర్గమునకు జెందినవారే తేలికగా నేతలు గావచ్చును. నేడు వారి మత ప్రచారమే తీవ్రముగా జరుగుచున్నది. దానికి కారణము వారి మతములో నున్న గొప్పతనము కాదు. విదేశముల నుండి వచ్చు కోట్లాది రూపాయలు. ఇప్పటికిని వారు వారి మత సిద్ధాంతములను, గొప్పతనమును గూర్చి తర్కించుటకు ముందుకు రాలేరు. పిలిచినను రారు. అజ్ఞానముతో, దారిద్రముతో బాధపడు అమాయకుల వద్దకు వెళ్ళి వారిని తమ బుట్టలో వేసికొని మతము మార్చి మాతృ దేశానికి, మాతృ సంస్కృతికి శత్రువులుగా తయారు చేయుచున్నారు.

నేడు మత ప్రచారము సంతలో సరుకు లమ్ముటవలె నున్నది. సంతలో సరుకులమ్మువారు "మా సరకు మంచిది, మా సరుకు మంచిది" అని యెట్లు కేకలు వేయుదురో అట్లే "మా దేవుడే గొప్ప. తేలికగా మీ పాపములను క్షమించి స్వర్గమునకు పంపును. మీ రోగములను బాగు చేయును. మీ దారిద్రము దూరము చేయును" అని కేకలు వేయుదురు. అమాయకులైన ప్రజలు వారివైపు ఆకర్షింపబడుచున్నారు. వారు తాత్కాలికముగా కొన్ని మందులతో, ధన సహాయముతో కొంత ఉపశమనము కలిగించి నెమ్మదిగా మతమును మార్చుదురు. అక్కడి నుండి మన దేవీ దేవతలపై విషమును గ్రక్కుచూ వారి హృదయములో విషమును నింపుదురు. వీరి ప్రచారము ఈ విధముగా నుండగా హిందువులని వ్యవహరింప బడెడు భారతీయార్యులు ధర్మమేదో విస్మరించి నానా దేవీదేవతల నుపాసించి పరస్పరము శతృవులై ఐకమత్యమును వీడి నిర్వీర్యులగుచున్నారు. సృష్ట్యారంభము నుండి మహాభారతకాలము వఱకు ఈ దేశమున వేదమత ప్రచారమే ఉండెడిది. ఉపాసనా పద్ధతులన్నియు నొకటిగా నుండెడివి. సంస్కృతి యంతయు నొకటిగా నుండెడిది. మహాభారత యుద్ధానంతరము వేదమత ప్రచారము సన్నగిల్లి దాని స్థానములో అనేక దేవీ దేవతల ఉపాసన ప్రారంభమైనది. ఒకప్పుడు ప్రపంచమును పాలించిన ఈ జాతి బహుకాలము బానిసత్వములో

మ్రగ్గినది. ప్రపంచానికి గురువుగా విద్యా విజ్ఞానములనందజేసిన ఈ జాతి నేడు ఎన్నో విషయములలో వెనుకబడి విదేశీయుల సహాయము నర్థించుచున్నది. దీని కంతటికి కారణము మన మూల ధర్మ గ్రంథములైన వేదములకు దూరమగుటయే. ఆనాటి ప్రాచీన యున్నతికి వేదములే కారణము.

పరమేశ్వర వాణియైన వేదము విజ్ఞాన భండారము. మానవులకు కావలసిన సమస్త విద్యలు మరియు భౌతిక, సామాజిక, ఆధ్యాత్మిక విజ్ఞాన మంతయు సూత్రరూపమున అందు ఉపదేశింపబడినది. భారతీయ ఋషులు ఆ వేదమంత్రములను మననము చేసి శాస్త్రములు నిర్మించిరి. ముఖ్యముగా మానవునకు ఏ మార్గమున పయనించిన వ్యక్తిగా సామాజికముగా యున్నతి కలుగునో అట్టి మార్గములు వేదములందు ఎన్నెన్నో గలవు. అవి హేతుబద్ధమైనవి. విజ్ఞాన వంతమైనవి. ఒక దేశానికిగాని, ఒక కాలానికిగాని, ఒక వర్గానికిగాని పరిమితములు కావు. అట్లే వేదములలో నుపదేశింపబడిన క్రాంతి మార్గమెట్టిదో ఈ గ్రంథములో దిగ్దర్శనము చేయించుటకు ప్రయత్నించెదము.

వేదములను గుఱించి ఈ మధ్య దిన పత్రికలలో, సంపాదక లేఖలలో విమర్శలు కనబడుచున్నవి. ఇంతకు పూర్వము కూడా ఇటువంటి వ్యాసములు కొన్ని వచ్చినవి. వీటన్నింటికి కారణము కొందరు క్రైస్తవులు వేదములను విమర్శించుచు వ్రాసిన కొన్ని పుస్తకములే. అందు నేను కొన్ని చూచితిని. వేదముల యొక్క మూలమంత్రముల నుదహరించకనే కేవలము మంత్ర సంఖ్యను ఇచ్చి వారికి తోచినట్లు కల్పించి యొక భావము వ్రాసి దానిని విమర్శించిరి. ఆ సంఖ్యల ననుసరించి మంత్రములను చూడగా ఆ మంత్రములో నట్టి భావము నామమాత్రముగా కూడా లేదు. ఎక్కడనో యొకటి సంఖ్య కలియుచున్నదే కాని చాలా మంత్రములు సంఖ్యలు కలియుట లేదు. ఇది యంతయు దురుద్దేశ్యముతో చేసిన పనిగా గనబడుచున్నది. వాటిని చదివిన మన హిందూ ఆంగ్ల మానసపుత్రులు వేదములలో అదే యున్నదను సంకుచిత భావములతో నీ విమర్శలు జేయుచున్నట్లు తెలియుచున్నది. ఆ క్రైస్తవులు వ్రాసిన గ్రంథములకు గూడా కొంత ఆధారము లేకపోలేదు. కొన్ని వేదభాష్యములలో ముఖ్యముగా తాంత్రికులు వ్రాసిన వేదభాష్యములలో ఉవ్వట,

మహీధరులు వ్రాసినవి కారణము. వేదములకు తాంత్రిక పరముగా తాంత్రిక భావములు వాటినుండి బలవంతముగా వెలికి తీసినట్లుగా నున్నవి. ఎవరో ఒకరు వ్రాసిన రామాయణమును చదివి యొక నాస్తికురాలు ముప్పాళ రంగనాయకమ్మగారు వ్రాసిన "రామాయణ విషవృక్ష" మను గ్రంథమువలె ఆ గ్రంథము లున్నవి. రామయణ విషవృక్షములోని భావములు మూల వాల్మీకి రామాయణములోని భావములకు భిన్నమైనట్లే ఈ భాష్యములు మూల వేద భావములకు చాలా భిన్నముగా నున్నవి. సాయణాచార్యులు కూడా వేదములకు యజ్ఞపరముగా మాత్రమే అర్థము వ్రాసిరి. వారు వేదములు సృష్ట్యారంభమున పరమేశ్వరుడు చేసిన యుపదేశములని ఒక ప్రక్క చెబుతూనే ఆ వేదములలో చరిత్ర సంబంధమైన విషయము లున్నవని వ్రాయుట జరిగినది. ఇవి స్వవచన వ్యాఘాతములే. మన ప్రాచీన మహర్షులు వేదములను చదివి, మననము చేసి, అంతర్ముఖులై సమాధి స్థితిలో సాక్షాత్కరించుకొనిన అర్థములనే వారు రచించిన బ్రాహ్మణ ఆరణ్యక వ్యాఖ్యాన గ్రంథములలో చాలా హేతు బద్ధముగా, వైజ్ఞానికముగా నిర్వచించుట జరిగినది.

వేదములలోని పదములన్నియు చాలా వరకు యౌగికములు. కొన్ని పదములు యోగారూఢములు. కేవలము రూఢిగా వాడబడిన పదమొక్కటియైనను వేదములందు కానరాదు. మూలధాతువు నుండి ఒక పదము కొన్ని ప్రత్యయముల కలయికచే నేర్పడును. అట్లేర్పడిన పదమందు మూల ధాతువులో నుండు అర్థమే యుండును. బంగారము నుండి నిర్మితమైన వివిధ రకముల నగలన్నియు బంగారు గుణములనే కలిగి యుండు నటులనే మూల ధాతువులోని అర్థమే దానితో ఏర్పడిన పదములన్నిటి యందును భాసించుచుండును. ఇట్టి పదములను యౌగిక పదము లందురు. ఆ యౌగికకార్థముతో బాటు ఒక ప్రత్యేక వస్తువును సూచించుటకు ప్రయోగించబడిన పదములను యోగారూఢములందురు. ఉదాహరణకు "అఘ్న్యా" యను పదమునకు హింసించరానిది యని మూలార్థము. కాని అది హింసించరాని జంతువులలో మొదటగా పేర్కొనదగిన గోవునకు వాడబడినది. ఇట్టి పదములనే యోగారూఢములందురు. రూఢి పదములలో నటువంటి యౌగికార్థము నామ మాత్రముగా కూడా నుండదు. ఉదాహరణగా సైంధవ మను పదమును చెప్పవచ్చును. సైంధవ మనగా సింధు దేశమందు

పుట్టినదని అర్థము. కాని లోకములో నీ పదమును ఉప్పు, గుఱ్ఱములకు వాడుదురు. ఒకప్పుడు సింధు దేశములో మంచి గుఱ్ఱము లెండెడివి. ఉప్పు తయారయ్యేడిది. అందుచే నీ పదము వాటికి రూఢిగా నేర్పడినది.

వేద పదములను యాస్క మహర్షి రచించిన నిరుక్త శాస్త్రము చక్కగా విశదముగా నిర్వచించినది. అందుచేతనే ఋషులు వేదాధ్యయనమునకు ముందు వాటి షడంగములైన శిక్ష, కల్పము, వ్యాకరణము, నిరుక్తము, ఛందస్సు, జ్యోతిష్యము లను ఆరు అంగములను విధిగా అధ్యయనము చేయవలెనని చెప్పిరి. అట్టి అధ్యయనము చేయకనే కనీసము ఋషులు వ్రాసిన వ్యాఖ్యాన గ్రంథములనైనను చదువకనే వేదములను విమర్శించుట దుస్సాహసము. ఈ విమర్శలను రచించిన రచయితలకు, ప్రచురణ కర్తలకు ఉత్తరములు వ్రాయగా సమాధానములు లేవు. మాతో తర్కము చేయమని కోరినప్పటికి నెవ్వరును ముందుకు రాలేదు. వారు వేదములను, మన యితర గ్రంథములను విమర్శించినట్లు బైబిలు కురానులను విమర్శించ సాహసించలేరు. బైబిలు, కురానులలో మన పురాణములను మించు నెన్నో అసభ్యకర, విజ్ఞాన విరుద్ధ కట్టుకథలు గలవు. వాటిని విమర్శించిన తమ గతి యేమగునో వారికి బాగుగా తెలియును. అందుచే ఆత్మ సంరక్షణార్థము వా రట్టి పనిని చేయరు. హిందువులు విశాల హృదయులు కనుక పొగడ్తలతో పాటు విమర్శలను కూడ గౌరవించెదరు గాన ఇట్టి సాహసము చేయుచున్నారు.

వివేకానందుడు చెప్పినట్లు ఈ హిందూ జాతి గాఢమైన నిద్రలో మునిగియున్నది. తన ధర్మమునకు హాని జరుగుచున్నను, తన సంస్కృతి భ్రష్టమగుచున్నను, ఎంత మంది సంస్కర్తలు నిదురలేపినను లేవనంతగా గాఢముగా నిదురించుచున్నది. అందుచేతనే వీరిని వివేకానందుడు Sleeping Lions అని సంబోధించియుండెను. ఈ స్తబ్దత మంచిది కాదు. దీని వలన తమకే గాక తమ ముందు తరాలకును తీవ్ర ద్రోహము చేసిన వారగుదురు. మా ఈ "వైదిక క్రాంతిపథం" నిదురపోవు చున్న ఈ సమాజమును మేల్కొలుపుటకై శక్తి కొలది ప్రయత్నించును. వేదములలో సూత్రప్రాయముగా చెప్పబడిన సామాజిక క్రాంతిని వివరించుటకే మా ఈ చిన్న ప్రయత్నము.

# త్యాగీ భవ

## లోభివి కాకుము - త్యాగభావముతో ననుభవింపుము

ఈశా వాస్య మిదం సర్వం యత్కించ జగత్యాం జగత్ ।
తేన త్యక్తేన భుఞ్జీథా మా గృధః కస్య స్విద్ధనమ్ ॥
(యజు. అ. 40, మం. 1)

ఈ సమస్త జగత్తు ఈశ్వరునిచే పాలించబడుచున్నది. అందుచే ప్రపంచముపై మమకారము (నాదియను భావము) వదలి దానిని త్యాగభావముతో అనుభవింపుము. ఎవరి ధనమును అన్యాయముగా కోరకుము. లోభివి కాకుము. ఇది యే యొక్కరి సొత్తును కాదు. అందరకు జెందినది.

ఇది యజుర్వేద మంత్రము. ఈ అధ్యాయమునే ఈశావాస్య ఉపనిషత్ అందురు. మంత్రములోని మొదటి పాదము ఈ ప్రపంచములోని యొక ప్రాకృతిక నియమమును విశదీకరించుచున్నది. రెండవ పాదము ఆ ప్రాకృతిక నియమమును గుర్తించి తద్వ్రతధారులై అభ్యుదయ నిశ్శ్రేయసముల బొందుడని ప్రబోధించుచున్నది.

తత్వవేత్తలు ప్రపంచ మూలకారణములను వెదకుచు వారికి తోచిన విధముగ నిర్వచించుచుందురు. నేటి వైజ్ఞానికులు సృష్టి కారణములకొఱకు తీవ్రముగా పరిశోధించుచున్నారు. ఈ ప్రపంచమంతయు అణువులచే నిర్మింపబడి యున్నదనియు చెప్పుదురు. బ్రహ్మాండములోని గ్రహ గోళముల పరిభ్రమణము వలె అణుగర్భమున గూడ పరమాణువులు పరిభ్రమించు చున్నవనియు చెప్పుచుందురు. దీనినిబట్టి అణువు మొదలు బ్రహ్మాండమంతయు పరిభ్రమణము- చలనము జరుగుచుండునని తెలియుచున్నది, ఈ విజ్ఞానము నేటి వైజ్ఞానికుల ఆధునిక ఆవిష్కారము కాదు. భారతీయ తత్వవేత్తలు ఏనాడో యీ విషయమును కనుగొనిరి. భారతీయ ఆలోచనలకు మూలాధారము

వేదములు. వేదము ఈశ్వరవాణి యనియు, సృష్టి విజ్ఞాన మూల సూత్రములన్నియు అందు గలవనియు వారి సంపూర్ణ విశ్వాసము. వారి ఆలోచనలను ప్రమాణీకరించునపుడు వేదములనే పరమ ప్రమాణములుగ గ్రహించవలెనని– 'తద్వచనాత్ ఆమ్నాయస్య ప్రామాణ్యమ్' అని చెప్పియుండిరి. అట్టి విజ్ఞాన మూల గ్రంథములైన వేదములలోని ఈ మంత్రము ఒక వైజ్ఞానిక తథ్యమును (ప్రకృతి నియమమును) ప్రకటించు చున్నది. ఈ మంత్రములోని ముఖ్య పదము జగత్. 'జగత్' అను పదము గమ్ ధాతువు నుండి ఏర్పడినది. గమ్ ధాతువునకు గతి, గమనము అని యర్థము. గమనము గలిగినది జగత్తు అగును. ఈ గమనము నియంత్రితమై యుండును. కనుక ఈ జగత్తు నందంతయు చలనమే గాదు, నియంత్రిత చలన మున్నది.

గతి యనగా నేమో కొంత వివరముగా తెలిసికొనవలసి యున్నది. మనము నడుచునపుడు ఒక స్థానములో గతి యారంభ మగును. రెండవ స్థానములో గతి సమాప్తమగును. ఇందు స్థానము స్థిరముగనే యుండును. స్థానము (ఆధారము) లేనిది గతియెట్లు కలుగును ? అందుచే గతి మరియు స్థాన మనునవి పరస్పర విరోధులు కావు, సాపేక్షికములు. పరివర్తన మనగా కూడా నొక వస్తువు అవస్థాంతరము జెందుటయే యగును గాని మఱియొక క్రొత్త వస్తువు అగుట కాదు. పరివర్తిత వస్తువులో పూర్వ వస్తు గుణము లుండియే యుండును. వెంట్రుకలు గలవాడు తల గొరిగించుకొనిన గుండు వాడగును. కాని యా వ్యక్తి వేరొక వ్యక్తి కాజాలడు. అట్లే మఱియొక వ్యక్తికి గుండు ఉన్నంత మాత్రమున అతడు మొదటి వ్యక్తి కాజాలడు.

ఒక వస్తువు నడుచుచున్నది, కదలుచున్నది యన వేఱొక వస్తువు యొక్క ఆధారము పైననే మరియొక వస్తువు కదలుచుండును. ఈ కదలుట నియంత్రితమైనపుడు దీనిని నియమించునది యేదైనా యొక వస్తువుండి యుండవలయును. చలాయమానమైన యీ ప్రపంచములో అణువణువు నందును ఈ నియంత్రిత చలనము గనబడు చుండును. అట్టి యీ జగత్తునకు కర్త లేడనుట యున్మత్త ప్రలాపము గాక మరి ఏమగును.

ప్రకృతిలోని స్వాభావిక గుణముల వలన కొన్ని ప్రత్యేక పరిస్థితులలో అణువు లేర్పడి మరికొన్ని పరిస్థితులలో మూలధాతువులు(elements), వివిధ ఖనిజ లవణములు తయారైనవే కాని వీటికి కర్తలేడని చెప్పు వైజ్ఞానికుల కథనము సత్యము గాదు. స్వభావముచే జగత్తుత్పన్నమయ్యేనని అది వినాశనమెన్నడును కాజాలదు. వినాశనము కూడా స్వభావముచే కలుగునని నమ్మితిమేని యుత్పత్తి కాజాలదు. ఈ రెండు పరస్పర విరుద్ధ గుణములు ఒకే వస్తువు నందుండ జాలవు. ఈ ప్రకృతిలోని పదార్థము లన్నియు జ్ఞానపూర్వకముగా, యుక్తి పూర్వకముగా కలుప బడినవి. వీటిలో నిర్మాణము, రచన గలదు. జడ పదార్థములలో జ్ఞానము లేదు గాన వీటిని కలిపిన ఒక అనంత ప్రజ్ఞాసామర్థ్యములు గల కర్తను అంగీకరించక తప్పదు.

ఈ మంత్రములోని మొదటి పాదము ఈ జగత్తంతయు నియంత్రిత చలనము గలిగి యున్నదనియు, ఈ గతిని నియమించు నీశునిచే బ్రహ్మాండమంతయు నావరింపబడియున్నదనియు చెప్పుచున్నది.

కొందరు గతి విరోధ తత్త్వవేత్తలు తమ సిద్ధాంతమును నిరూపించు కొనుటకు నొక కుయుక్తిని పన్నుచున్నారు. వారు ఈ గతి యనునది లేనేలేదనియు గతిగా కనబడుచున్నదంతయు భ్రాంతి యనియు అందురు. వారి యుక్తి యీ విధముగా నుండును –'A thing does not move where it is. It does not move where it is not. Therefore it does not move at all' – ఒక వస్తువు తానాక్రమించిన పరిధిలోనే కదలలేదు. తాను లేనిచోట కదలుట యను ప్రసక్తియే యుండదు. అందుచే వస్తువు కదలుటయే జరుగదు. ఉదాహరణకు మన శరీర మాక్రమించిన ప్రదేశములోనే మనము కదలలేము. కదలవలెననిన ఆక్రమించిన ప్రదేశభాగమును విడువ వలసి యుండును. మనము లేని ప్రదేశములో కదలుట యనునదియే అసంభవము. గాన వస్తువు కదలనే కదలదు. ఇది వారి వాదము. కాని యింత మాత్రముచేత మనము కదలకుండా నుండి పోవుచున్నామా ? మనము కదలుటయే కాదు. వాయు మనోవేగముల పయనించుచున్నాము. కనుక ఈ సూత్రమును మార్చి

వ్రాయవలసి యున్నది. A thing does not move where it is. It does not move where it is not. But it can move from where it is to where it is not. ఒక వస్తువు తానున్న ప్రదేశ భాగములోనే కదలలేదు. తాను లేని చోట కూడా కదలుట జరుగదు. కాని అది యున్నచోటు నుండి అది లేని మరే చోటుకైనను కదల గలదు.

గతి వాస్తవమైనచో గతి విధానము కూడా వాస్తవమే యగును. గతిని అంగీకరించుచు గతి విధానమును అవిద్య, భ్రాంతి, మాయ, స్వప్నము అనుకొనుట మూర్ఖతయే యగును. సృష్టిని పరిశీలించిన సూర్యోదయాస్తమయములు, సూర్య చంద్ర గ్రహణములు, ప్రాణికోటి వృద్ధి క్షయములు నియమ బద్ధముగా జరుగుచున్నవి. స్వప్నములో వలె అసంబద్ధముగా నేమియును జరుగుట లేదు. ఈ జగత్తు మిథ్య (స్వప్నము) అను వాదము మానవ జాతికి జేసిన యపకారము స్పష్టముగా పైకి కనబడక పోయినను జాతి భౌతిక వికాసమును విష పూరితము (slow poision) జేసి దెబ్బ తీసినది. ఇప్పటికిని దీని చెడు ప్రభావము మందగతిని నడుచుచునే యున్నది.

ఈ జగన్మిథ్యావాద ప్రభావము వలన– "ఈ ప్రపంచమే లేనపుడు, అంతా బ్రహ్మమే అయినపుడు మనము సాధించవలసిన దేమున్నది ? సాంసారిక బంధము లెందుకు ? 'అంతా బ్రహ్మయే' అను భావనలో తన్మయులమైన సరిపోదా ?" అను హీన భావములతో ఆర్యులలో అకర్మణ్యత, ఉదాసీనత, మిథ్యా వైరాగ్యము లుద్భవించినవి. ఈ మిథ్యావాదులు పంచ మహాయజ్ఞాది వైదిక కర్మలను విడచి భార్యా బిడ్డలను, తల్లి దండ్రులను వదలి బైరాగులైరి. ఇట్లు ఇది మానవులను కర్తవ్య హీనులుగా, సోమరులుగా జేసి పురుషార్థహీనులను, పిరికి పందలను చేసినది. దీనివలన విద్యా విజ్ఞానములు పురోగమించక పోగా తిరోగ మించినవి. ప్రపంచ గురువైన ఆర్యజాతి పేద విద్యార్థిగా మారిపోయినది. చక్రవర్తి రాజ్యము బానిస రాజ్యమైనది. సదాచారములు మూఢాచారములుగా-దురాచారములుగా మారినవి. యథార్థముగా ఈ "జగన్మిథ్యా" సిద్ధాంతమే ఒక మిథ్య.

యంత్రములోని చిన్న చిన్న భాగములు (చక్రములు) ఒక నియమిత గతిలో నడచుచుండుట వలన ఆ యంత్రము వలన నొక లాభము సిద్ధించును. ఆ లాభ మేదియో, తన నడకను నియంత్రించునది యేదియో నా చక్రములకు తెలియదు. అటులనే భూ సూర్య చంద్ర నక్షత్రాదులు నియమబద్ధముగా తిరుగు చుండుట వలన ఈ భూమిపై వాతావరణము, జీవకోటి మనుగడ నిరంతరముగా సాగుచున్నది. జడ వస్తువులైన భూ సూర్య చంద్ర నక్షత్రాదులకు ఇదేమియును తెలియదు. యంత్ర నిర్మాణ కర్తను వలె యీ సృష్టి నిర్మాణకర్తనే యీ మంత్రము "ఈశ" పదముతో చెప్పినది. "ఈశ-నియమనే" అను ధాతువుతో "ఈశ" పదము ఏర్పడును. "ఈశ" పదమునకు నియమించు వాడని యర్థము. సృష్టి నియామకునిచే ఈ సృష్టిలోని గతిమానమైన సర్వజగత్తు ధరింపబడినది. వాస్య మనగా ఆచ్ఛాదించబడినది (ధరింప బడినది) యని యర్థము. యంత్రనిర్మాత యంత్రమునకు బాహ్యముగా నుండును. అతడు యంత్రమునకు పాలకుడు కాదు. కాని సృష్టి నిర్మాత సృష్టియందే వ్యాపించి దానిని పాలించుచు రక్షించుచుండును. సృష్టిలోని కొంత భాగము నశించినంత మాత్రమున సృష్టి నశించదు. కాలాంతరమున నశించిన భాగములో కూడా సృష్టిజరుగును. మహాప్రళయమున నశించినట్లు కనబడినను సూక్ష్మ రూపములో-ప్రకృతిగా నుండి మరల సృష్టి సమయమున ప్రకటమగును.

ఇప్పుడు మనము ఈ గతిశీల జగత్తుతో మన సంబంధమేమియో కూడా విచారించవలసి యున్నది. గతిశీల జగత్తు ఎప్పుడును నొకే యవస్థలో నుండదు. అవస్థాంతరము జెందుచుండును. అట్టి జగత్తులో మన మొకే చోట నిలబడవలెననిన సాధ్యపడదు. అటుల నిలచిన కాల చక్రముల క్రింద నలిగి నశించి పోవుదుము. ఆ కాల చక్రములు ఎట్టి పరిస్థితులలోను ఆగవు. అందుచే ఈ ప్రపంచమున మనము బాటసారుల వంటి వారము. బాటలు నడచుట కొరకే నిర్మించబడినవి. అట్టి బాటలో మనము తిష్ఠ వేసికొనియున్న సాగదు. అట్లున్నచో బాటసారుల వాహనముల క్రింద నలిగి నశించి పోవుదుము. జీవుని యొక్క జీవన యాత్రలో నీ శరీర మొక సత్రమువంటిది. సత్రము బాటసారులు కొద్ది దినములు వసించుట కొరకే. అక్కడనే స్థిర నివాస మేర్పరచుకొనుటకు

వీలుపడదు. ఆ సత్ర నియమములు మనలను వెడల గొట్టునట్లే యీ శరీరము కూడా కాలాంతరమున మనలను బయటకు వెడల గొట్టును. అందుచే యీ వేదమంత్రము " భుంజీథా'' ఈ జగత్తును అనుభవింపుమని చెప్పుచు "త్యక్తేన''– త్యాగభావముతో అనుభవింపుమని ఆదేశించు చున్నది. ఆ త్యాగభావన లేకున్న మనమే నష్టపోవుదుము. "యాథాతథ్యతో అర్థాన్ శాశ్వతీభ్యః సమాభ్యః' ' - పరమేశ్వరుడు ప్రపంచ పదార్థము లన్నిటిని ప్రాణులు అనుభవించుట కొఱకే సృజించెనని వేదము స్పష్టముగా చెప్పు చున్నది. అందుచే కేవల వైరాగ్యము బోధించెడు సాంప్రదాయములు కూడ బూటకములే యగును. త్యాగమనగా అనుభవింప కుండుట యని కాదు. రాగద్వేషములను వదలి ధర్మపూర్వకముగ తనకు లభించిన సుఖముల ననుభవింప వచ్చునని యర్థము.

"మాగృధః" - అను శబ్దము త్యాగభావముతో ననుభవింపుమని యుపదేశించుటయే గాక లోభివి కావలదని, యితరుల ధనమును ఆశించవద్దని హెచ్చరించుచున్నది. లోభి తాను సుఖవంచితు డగుటయేగాక సమాజమునకును ద్రోహము చేసిన వాడగును. ధనమును (భోగ్య పదార్థములను) ఇతరులకు అందకుండా దొంగిలించిన వాడగును.

"కస్య స్విద్ధనమ్'' ఈ ధన మెవ్వరిది ? ఏ యొక్కనిదో కాదు భగవంతునిది - భగవంతుని సృజన - భగవంతుని యొక్క ఐశ్వర్యము. గాన ఈ ప్రపంచ పదార్థములు ఏ యొక్కని సొత్తును కావు. అవి అందరి కొరకు సృజింపబడినవి. అవి సామాజిక సంపద. అందు మనము కష్టించి ధర్మ పూర్వకముగా కొన్ని సంపాదించుకొన్నను అవి శాశ్వతముగా మనవి కావు. కాలాంతరమున వాటినుండి యెడబాటు కలుగకపోదు. శరీరాన్ని వదలి వెళ్ళునపుడు ఏ చిన్న వస్తువును మన వెంట రాదు. అట్టి యీ ప్రపంచముతో మమకార బంధ మేర్పరచుకొని దుఃఖముల పాలగుట వివేకవంతులకు తగదు. ప్రపంచ విజేతగా ప్రసిద్ధి జెందిన అలెగ్జాండరు మరణశయ్యపై పడుకొని తాను సంపాదించిన వజ్రవైఢూర్య స్వర్ణ రజితములను చూడదలచెను. వాటన్నిటిని చూచిన తదుపరి నిరాశయే మిగిలెను. నా వెంట ఒక్క పైసను కూడ తీసుకొని వెళ్ళలేక పోవుచున్నానని బాధ పడెను. తన సమాధిపై తన రెండు రిక్త హస్తముల

నెత్తి చూపించుచున్నట్లుగా చిత్రించమని కోరెను. తాను వట్టి చేతులతో వెళ్ళిపోయితినని ప్రపంచమునకు తెలుపుటకే అట్లు కోరి యుండెను. కాన రాగమును వదలి నీకు లభించిన ధనమునకు నీవు ఒక ధర్మకర్త(Trustee) గా వ్యవహరింపుము.

ఈ ప్రకారముగా ఈ వేద మంత్రములో నాలుగు ముఖ్య విషయములు వివరింపబడినవి.

1. జగత్తు నందలి సర్వత్ర గల గతి విధానము.

2. దానిపై పరమేశ్వరుని ఆధిపత్యము.

3. జగత్తు జీవులు అనుభవించుట కొరకే నను విషయము.

4. అనుభవింపుము. కాని త్యాగముతో - నాది కాదను భావముతో ననుభవింపు మను ప్రబోధము.

ఈ వైదిక క్రాంతి (పురోగమన) మార్గము ననుసరించినంత కాలము మనువు చెప్పినట్లు మన జాతి అన్ని రంగములలో అగ్రగామిగా నుండెను. ఋషి మునులు, రామకృష్ణాదులు ఈ మార్గముననే తాము నడిచి ప్రజలను నడిపించిరి. మధ్య కాలమున స్వార్థ గురువులు తమ సాంప్రదాయ మార్గముల నేర్పరచి ప్రజలను ప్రక్కదారులకు మళ్ళించిరి. తద్వారా మన మెంతయో నష్టపోతిమి. సంస్కర్తలు జాతిని సరియైన దారిలో నడిపించ ప్రయత్నించిరి. కాని, వారికి వేదజ్ఞానము లేనందున వారికి తోచిన మార్గముల నేర్పరచిరి. దాని వలన కొంత మేలు జరిగినను పూర్ణప్రయోజనము కలుగలేదు. మరుగునపడిన యీ వేదమార్గమును మరల వెలుగు లోనికి తీసుకొని వచ్చిన మహర్షి దయానందునకు ఈ జాతి యెంతయో ఋణపడి యున్నది. ఆ విశాల వైదిక క్రాంతి పథమున త్యాగభావమును పెంచుకొనుచు ఒక యడుగు ముందుకు వేసి పయనింతము రండు.

## త్యాగీ భవ - ఏకపదీ భవ

# పురుషార్థీ భవ

## జూదరివి కాకుము - వ్యవసాయదారునివి కమ్ము

అక్షైర్మా దీవ్యః కృషిమిత్ కృషస్వ, విత్తే రమస్వ బహు మన్యమానః ।
తత్ర గావః కితవ తత్ర జాయా, తన్మే విచష్టే సవితాయమర్యః ॥
(ఋ. 10-34-13)

ఓ జూదరీ ! పాచికలను ఆడవద్దు. వ్యవసాయదారుని వలె పురుషార్థివి కమ్ము. ఆ స్వయం కృషితో వచ్చు ధనముతోనే సంతృప్తి జెందుము. దాని వలన నీకు గొప్ప గౌరవము లభించును. గొప్ప గొప్ప సంపదలు లభించును. నీ భార్య నీకు అనుకూలవతి యగును. అంతర్యామియై ప్రేరేపించు ఆ పరమేశ్వరుడు మన కొరకు ఈ ధర్మ రహస్యమును చక్కగా అనుభవమగునట్లు చేయును గాక!

ఋగ్వేద దశమ మండలములోని ముప్పై నాలుగవ సూక్తము జూదరులను గురించి వివరించు చున్నది. అందు మొదటి మంత్రములలో వారి ఆలోచన లెట్లుండునో, వారెట్లు గాలి మేడలు కట్టుచుందురో చివరకు ఆ మేడలు కూలి వారెట్లు అన్ని విధముల నష్టమైపోవుదురో వివరింప బడినది.

ప్రాచీన కాలములో పాచికలతో జూదమాడు వ్యసనముండెడిది. అది నేడు మరికొన్ని రూపములు దాల్చినది. కోడి పందెములు, గుర్రపు పందెములు, న్యూయార్క్ ప్రత్తి ధర యొక్క చివరి అంకెలతో నాడు బ్రాకెటు, పేకాట మొదలగునవి. లాటరీలు కూడా ఈ కోవకే జెందును. ఈ జూదరులందరి భావన కష్టపడకుండా ధనము నార్జించుటయే. వారికి ధనమును సంపాదించుటకు ఆ వ్యసనములే సాధనములుగా గనబడును. అట్టివారి ఆలోచనలను ఈ సూక్తము నందలి మొదటి 12 మంత్రములు ఈ విధముగా వివరించును.

"నిర్ధనుడనైన నాకు విభీతక (తాండ్రచెట్టు) వృక్ష చెక్కలతో జేయబడి భూమి మీద కదలాడు ఈ పాచికలు సోమరసము వలె ఆనందమును కలిగించుచున్నవి. నా పత్ని నాపై నెప్పుడును కోపము చూపలేదు. నన్ను అవమానించ లేదు. నాకు, నా మిత్రులకు మేలు చేసెడిది. అట్టి అనుకూలవతి, పతివ్రత అయిన పత్నిని కూడా విడచి యీ పాచికలనే యెక్కువగా ప్రేమించు చున్నాను. అవసరమైన ఆమెను విడిచి పెట్టుదును. జూదములో కూడా ఒడ్డుదును." అని నిశ్చయించుకొని జూదమాడి సర్వమును పోగొట్టుకొనును. అతనిని అతని ఊపిరియే ద్వేషించును. భార్య విరక్తురాలగును. యాచించినను అప్పిచ్చువాడు కానరాడు. బహుమూల్యమైన గుర్రమును కూడా ముసలిదైన దాని రక్షణ పోషణ లెట్లు చూడరో అట్లే జూదరి రక్షణ పోషణ లెవ్వరును చూడరు. జూదరియొక్క పత్నిని భర్తయే కాక మిగిలిన జూదరులు కూడా బాధింతురు. చివరకు తల్లి, తండ్రి, సోదరులు కూడా జూదరుని సరిగా చూడరు. అప్పులవారు బాధించుచున్నను అతనెవరో తమకు తెలియనట్లుగా నుందురు. అయినప్పటికి ఆ జూదరి పాచికలనే నమ్ముకొనును. వాటినే మిత్రులుగా భావించును. రంగురంగుల పాచికల శబ్దము లాతనిని మోహితుని జేయును. జూద వ్యసనము గల భాగ్యవంతులెవరో తెలిసికొని 'నేను మిమ్ము గెలిచెద'నని కవ్వించును. గెలుచుట కొరకు మోసము చేయ యత్నించును. ఆ పాచికలే అతని దృష్టిలో ఆయుధములు. అవే శత్రువులను చీల్చి చెండాడు అస్త్ర శస్త్రములు. అట్టి వ్యసనపరులు ఎంతటి వీరులైనను, రాజులు, మహారాజులైనను పాచికలతోనే యొకరి నొకరు గెలువ యత్నింతురు. ఆ పాచికలు భూమిపై నున్నను వారి హృదయములనవి కవ్వించు చుండును. వాటికి చేతులు లేకున్నను బాహు బల సంపన్నులను కూడా అణచిపెట్టును. నేలమీద చల్లగా పడియున్న ఆ పాచికలే జూదరుల హృదయములను కాల్చివేయు అగ్ని శకలము లగును. జూదరి తాను బాధలు పొందుటయే గాక తన భార్యను, తన తల్లిని కూడా బాధలకు గురి జేయును. ఋణగ్రస్తుడై ధనము కొరకు దొంగతనమునకు బయలుదేరును. జూదరి యితరుల ధన సంపద లను, అనుకూలమైన దాంపత్యమును చూచి అసూయాగ్రస్థు డగును. పగలు పాచికలాటలతో గడిపి,

రాత్రులందు గృహము లేకపోవుటచే యే చెట్టు క్రిందనో చలిమంట వేసుకొని గడుపును. చివరకు పాచికలందు విరక్తుడై వాటికి చివరగా ఒక నమస్కారము పెట్టి సత్పురుషుల నాశ్రయించును. అట్టి విరక్తున కెట్లు ఉపదేశింపవలెనో యీ పై 13వ మంత్రము మనకు తెలుపుచున్నది.

వేదము చెప్పు పై కథనమంతయు మన నిత్య జీవితములో జూదరులందు చూచు చున్నాము. ఇతిహాసములో ధర్మరాజు దీనికి యొక ప్రసిద్ధ ఉదాహరణ. ఎన్నో గొప్ప గుణములు కలిగియుండియు, బల వీర్యములు కలిగియుండియు, అనుకూలమైన బాంధవ్యమును కలిగియుండియు పాచికల కారణముగ అనేక కష్టనష్టముల పాలయ్యెను. తన బంధువు లందరిని కష్టపెట్టెను. ఈ మంత్రములో అట్టి జూద భావమును దూరము చేసికొని వ్యవసాయదారుల వలె కష్టజీవులు కండని పరమేశ్వరు డుపదేశించు చున్నాడు.

లోకములో రెండు రకముల దార్శనిక వాదములు కనబడుచున్నవి. అందు మొదటిది అదృష్టవాదము. అదృష్టవాదులు సోమరులై అదృష్టము కొరకు అర్రులు చాచుచుందురు. దేవీ దేవతల, సాధు సన్యాసుల సేవింతురు. రెండవది పురుషార్థ వాదము. లోకములో పురుషార్థముతోనే అన్ని కార్యములు సిద్ధించుననియు పూర్వజన్మకృత పురుషార్థమే నేటి అదృష్టమునకు కారణమనియు వీరు నమ్ముదురు.

ఈ మంత్రములో భాగ్యవాదుల ప్రతినిధిగా జూదరిని తీసుకొని ఒక చక్కటి దార్శనిక వాదమును పరమేశ్వరు డుపదేశించుచున్నాడు. లోకములో జూదము వలన బాగుపడిన వారు చాలా అరుదు. అట్టి వారి భాగ్యము కూడ తాటియాకుల మంటవలె క్షణికమే. పురుషార్థ వాదము ననుసరించు వ్యవసాయదారులకు 1,2 సంవత్సరములు ప్రకృతి అనుగ్రహించక పోయినను తిండికి లోటుండదు. మరియొక సంవత్సరమైన ప్రకృతి కరుణించి భోగ భాగ్యముల నివ్వగలదు. వ్యవసాయదారులు ఆహారము నుత్పత్తి చేసి తాము తిని పదిమందికి పెట్టగలుగుదురు. జూదరి తా నుత్పత్తి చేయకపోగా నితరుల ఆహారమును దోచుకొనును. లోకములో పురుషార్థము చేయనిది జీవించుటయే

దుర్భరము. సంస్కృతములో నొక ప్రసిద్ధ సామెత గలదు. "సుప్తస్య నహి సింహస్య ప్రవిశంతి ముఖే మృగాః" మృగరాజైన సింహమైనను తాను నిదురపోవుచున్నచో మృగములు తమంత తాముగా వచ్చి నోటిలో ప్రవేశించవు. కనుక భాగ్యవాదము భ్రష్ట దార్శనిక వాదము.

ఈ మంత్రములో 'కృషస్వ' అను గంభీరార్థము గల మరియొక పదము ప్రయోగించబడినది. ఈ ఆత్మనేపద ప్రయోగము వలన యీ పదమునకు "గర్భితమైన ఆహారాది సంపదను నేర్పుతో బయటికి తీసుకురా" అను అర్థము వచ్చును. వేదములందు వికసిత మానవుని 'కృష్టి' పదముతో సంబోధించుట చాలాచోట్ల కనబడును. సామాన్య మానవునకు ఈ 'కృష్టి' శబ్దము వర్తించదు. ప్రకృతిలో గాని, మానవునిలో గాని నిహితమైన అద్భుత శక్తులను వికసింపజేయ గల వారికే యీ 'కృష్టి' పదము వర్తించును. తల్లి, తండ్రి, ఆచార్యుడు, సమాజము, ప్రభుత్వము కృషకులైన యెడల నుత్తమ మానవజాతి నిర్మాణము జరుగును. అట్టివారే మానవుని పశుత్వము నుండి సంస్కరించి సుసంస్కృత, సువికసిత మానవునిగా జేయగలరు. సంస్కృతి కన్నను కృషి గొప్పది. సంస్కృతి మానవునిలో గల దోషములను పోగొట్టి మంచిని మాత్రమే పెంచగలదు. కృషి మానవునిలో దాగియున్న అద్భుత శక్తులను పైకిలాగి వికసిత పరచును. బియ్యములోని రాళ్ళను వేరుచేయుట సంస్కృతి అయినచో బియ్యమును పండించుట కృషి యగును. వైదిక దర్శనము జూదరుల దర్శనము కాదు. వ్యవసాయదారుల దర్శనము.

తరువాత మంత్ర భాగములో వ్యవసాయదారులగుట వలన నేయే ప్రయోజనములు కలుగునో వివరింపబడినది. "విత్తేరమస్వ బహుమన్య మానః" వ్యవసాయదారుడు గొప్ప గౌరవమును బొందుచు, కష్టార్జితముతో భోగ భాగ్యముల ననుభవించును. వ్యవసాయదారుడు ధనము నుత్పత్తి జేయుచుండ జూదరి ధనమును దోచుకొనును. దోచుకొని ధనవంతుడైనను సంఘములో వ్యవసాయదారుని వలె గౌరవమును పొందలేడు. వ్యవసాయ దారుని వంటి ఆత్మతృప్తి, ఆత్మ విశ్వాసము జూదరికి ఉండవు.

"తత్రగావః" వ్యవసాయదారుడు భోగ భాగ్యములనే గాక గోసంపదను కూడా పొందును. ధన సంపదకన్న గోసంపద శ్రేష్ఠమైనది. ఏలయన గోవులిచ్చే పాలు దానితో సిద్ధమగు పెరుగు, వెన్న, నెయ్యి మానవులను పోషించును. ఆవు పేడ యెరువుగా నుపయోగపడి పంటలను పండించును. ఆవులు వ్యవసాయమునకు ఉపయోగపడెడు కోడె దూడలను, ముందు తరాలను పోషించే ఆవులను ప్రసవించును. అందుచేతనే మహర్షి దయానందుడు గోరక్షణ, పాలనలకు ఎక్కువ ప్రేరణ నిచ్చియున్నాడు. వారు రచించిన 'గో కరుణానిధి' లో ఆవు వలన కలిగెడు లాభములను హేతు బద్ధముగా, శాస్త్ర ప్రమాణాలతో ఆధునికులు కూడా కాదనలేని యుక్తులతో వివరించుట జరిగినది. సగటున ఒక ఆవు తన జీవిత కాలములో తన యుత్పత్తులతో **4,10,440** మందిని యొకసారి తృప్తి పరచ గలుగు నని హేతుబద్ధముగా నిరూపించినాడు. ఇక జూదరులు గోరక్షకులు కాకపోగా వారు గోభక్షకు లయ్యేదరు.

'తత్ర జాయా' - వ్యవసాయదారులు గోసంపదనే గాక అనుకూలవతియైన భార్యను పొందెదరు. వారి భార్యలు వ్యవసాయాది పనులలో వారికి చేదోడు వాదోడుగా నిలుతురు. గౌరవముగా బ్రతుకుదురు. జూదరుల భార్యలు అట్లుగాక పతిని అసహ్యించుకొందురు. చులకనగా జూతురు. ద్రౌపది వంటి సాధ్వి ధర్మరాజులోని జూదగుణము వలన తన భర్త చక్రవర్తియైనను చులకనగా మాట్లాడిన సందర్భములు మహాభారతమున అచ్చటచ్చట కానవగును. ద్రౌపది వలెనే జూదరి భార్య అనేక కష్టములకు గురి యగును. అవమానముల పాలగును. ఆమె కన్నీరే జూదిరి పాలిట శాపమగును.

'తన్మే విచష్టే సవితాయ మర్యః' - "ఈ దార్శనిక పురుషార్థ వాద సిద్ధాంతమును సర్వాంతర్యామియైన పరమేశ్వరుడు మా హృదయములందు ప్రకాశ పరచెను. ఇది మేము నిర్మించిన సిద్ధాంతము కాదు. పరమేశ్వర నిర్మితము. దానిని మేము అనుసరించుచు లాభము పొందుచున్నాము. ఓ జూదరులారా ! మీరును అనుసరించి లాభాన్వితులు కండు" అని పశ్చాత్తాప చిత్తులైన జూదరులకు విద్వాంసులు ఉపదేశించ వలెనని యీ మంత్రము

చెప్పుచున్నది. నేడు విద్వాంసులు, ప్రభుత్వము కూడ ఈ వేదాజ్ఞను ధిక్కరించు చున్నారు. తా మనుసరించి యితరులకు బోధించక పోగా జూదముతో సమానమైన లాటరీలు, గుర్రపు పందెములు మొదలగు వాటిని ప్రభుత్వములే ప్రోత్సహించు చున్నవి. ప్రజలను దురాశ పరులగునట్లు ప్రోత్సహించుచున్నారు. ఇది చాలా విచారకరము. దానితో పాటు ఎన్నో అవగుణములు కూడా ప్రజలను అంటి పీడించుచున్నవి. ప్రజలు దరిద్రులై త్రాగుడుకు బానిసలై దొంగతనములకు, అత్యాచారాలకు పాల్పడు చున్నారు. కాన జూదము ఏయే రూపమున నున్నను నిషేధించుట ప్రభుత్వముల నైతిక బాధ్యత.

ఈ మంత్రము తరువాతది యీ సూక్తములోని చివరిది యైన 14వ మంత్రము–విరక్తుడు, పశ్చాత్తాప చిత్తుడునైన జూదరిని విద్వాంసులు మిత్రుని వలె ఆదరించవలెనని చెప్పును. వారిని అవమానపరచక కర్తవ్యమును బోధించి తమలో కలుపు కొనవలెనని ఉపదేశించును. గాన మనమంతా పురుషార్థపరుల మగుచు తోటివారిని పురుషార్థపరుల జేయుచు మరొక అడుగు ముందుకు వేయుదుము రండు.

## పురుషార్థీ భవ - ద్విపదీ భవ

కృతం మే దక్షిణే హస్తే జయో మే సవ్య ఆహితః ।
గోజిద్ భూయాస మశ్వజిద్ ధనంజయో హిరణ్యజిత్ ॥

*(అథర్వ-7-50-8)*

నా కుడిచేత పురుషార్థమున్నది. ఇక ఎడమచేత విజయము నందుకొనుటలో సందేహమేమి? తప్పక లభించును. పూర్ణ పురుషార్థముతో గోవులను, అశ్వములను, ధనమును, హిరణ్యమును కూడ జయించి 'వైదిక క్రాంతి పథం'బున చక్రవర్తి రాజు నయ్యెదను గాక!

# వివేకవాన్ భవ

## మీ విద్య వివేకయుక్తము కావలెను.

శం నో దేవా విశ్వదేవా భవన్తు శం సరస్వతీ సహధీభిరస్తు ।
శమభిషాచః శమురాతి షాచః శం నో దివ్యాః పార్థివాః శం నో అప్యాః ॥
(ఋగ్వేదము 7-35-11)

మా దేవతలు (విద్వాంసులు) విశ్వదేవతలు (విశ్వ మానవ కల్యాణమును కోరు దేవతలు) కావలెను. మా సరస్వతి (విద్య) బుద్ధితో కూడినది కావలెను. మా అనుయాయులు మాకు శాంతిని కలిగింతురు గాక! మా నాయకులు మమ్ము శాంతి మార్గమున నడిపింతురు గాక! ద్యులోక పృథివీలోక జలలోక పదార్థము లన్నియు మరియు ఆ పదార్థముల నెరిగిన విద్వాంసులందరు మాకు శాంతిని కలిగింతురు గాక!

దేశ సమగ్ర పురోభివృద్ధికి ముగ్గురు చాల అవసరము. అందు మొదటి వారు జవానులు (సైనికులు). తన దేశ భూ భాగమును, తన ప్రజలను, తన సంపదలను రక్షించుకొనలేని దేశము త్వరలోనే పతనము కాగలదు. అందుచే జవానులు ప్రథమ స్థానము వహించగలరు. రెండవ వారు రైతులు. దేశ ప్రజలకు ఆహారాది పదార్థములను పండించి యిచ్చు వారు పటిష్ఠముగా లేనపుడు దేశము పరాధీనమగును. అందుచేతనే కీ. శే. లాల్ బహదూర్ శాస్త్రి గారు "జై జవాన్" నినాదముతో బాటు "జై కిసాన్" అను నినాదమును కూడా కలిపి యుండిరి. వీరిద్దరే గాక దేశ సమగ్ర పురోభివృద్ధికి విద్వాంసులు కూడా అవసరమగుదురు. విద్యావిజ్ఞానముల వలననే దేశ ప్రజలు ఎన్నో రంగములలో పురోగమించగలరు. సైనిక శక్తిని, పోషక శక్తిని మరింత వృద్ధి చేసికొన గలుగుదురు. అందుచే 'జై విద్వాన్' అను నినాదము కూడా కలుపవలసి యున్నది. 'జై జవాన్', 'జై కిసాన్', 'జై విద్వాన్' అనునవి మన నినాదములు కావలెను.

ఈ మంత్రము ప్రార్థనా మంత్రము. వేదములలో ప్రార్థనా మంత్రములే యెక్కువగా కలవు. పై పైన ఆలోచించువారు వాటిలో చాలా పునరుక్తము లున్నట్లుగా పొరబడుదురు. ఈ మంత్రము లన్నియు ఎన్నో జ్ఞానవిజ్ఞాన విషయములను, ప్రేరణాత్మక విషయములను ప్రబోధించు చున్నవి. వాటిని ప్రకరణానుసారముగా - సందర్భానుసారముగా అర్థము చేసికొనవలసి యున్నది. ఈ మంత్రము యొక్క మొదటి భాగములో "శం నో దేవా విశ్వదేవా భవంతు" మా దేవతలు విశ్వ దేవతలు కావలె నను ప్రార్థన గలదు.

దేవత లనగా దివ్యగుణములు కలవారు, దివ్య గుణములు గలిగిన పదార్థములు నని సామాన్యార్థము. దేవ పదము చాలా విశాలార్థము గలది. వేదాంగమైన నిరుక్త శాస్త్రమందు యాస్క మహర్షి దేవ పదమునకు చాలా నిర్వచనములు చెప్పి యున్నాడు. అందు ఒక ముఖ్యమైన నిర్వచనము జ్ఞప్తి యందుంచు కొనవలెను. అది ఏమన 'దేవో దానాద్ వా, దీపనాద్ వా ద్యోతనాద్ వా, ద్యుస్థానే భవతీతి వా' దేవతలనగా దానశీలురు, లేక విద్యతో ప్రకాశించుచు నితరులకు ప్రకాశమిచ్చువారు, లేక ద్యుస్థానమున నుండు సూర్య చంద్ర నక్షత్రాదులు. ఈ నిర్వచనమును బట్టి విద్వాంసులైన వారే అజ్ఞానమును దూరము జేయు ప్రకాశకులై వెలుగుదురు. అందుచేతనే ఋషులు 'విద్వాంసో వై దేవాః' అని కూడా చెప్పి యుండిరి. ప్రపంచములో మన మేలు కోరు వారందరు మనకు దేవత లగుదురు. ప్రతి వ్యక్తికి ముఖ్యముగా నలుగురు దేవతలుందురు. వారు తల్లి, తండ్రి, ఆచార్యుడు, ధర్మోపదేశము జేయు అతిథి (సంన్యాసి). ఈ నలుగురిలో మొదట లెక్కించ వలసినది తల్లి. తల్లి మన మేలును ఎక్కువగా కోరును. కనుక తల్లి మొదటి దేవత. కాని ఆమె విశ్వదేవత కాలేదు. అనగా విశ్వమానవులందరికి తల్లి కాలేదు. తన కుమారుని మేలు కొరకు ఇతరుల కపకారము జేయుటకు కూడా సిద్ధ పడవచ్చును. మన తల్లి మనకు దేవత యైనట్లే ప్రతివ్యక్తికి అతని లేక ఆమె తల్లి దేవత యగును. జంతువులకు గూడా వాటి తల్లి వాటికి దేవత యగును. కాని కొంత మంది మూర్ఖులు, అవిద్వాంసులునైన తల్లిదండ్రులు తమ బిడ్డలకు గలుగు రోగాది అరిష్టములు పోవుటకు దేవీ దేవతలకు బలులను అర్పింతురు. అట్టి తల్లిదండ్రులు

వారి బిడ్డలకు దేవతలైనను బలిగా నిచ్చు జంతువుల పాలిట రాక్షసులగుదురు. కనుక పై నలుగురు విశ్వదేవతలు కారు. విశ్వ దేవతలగుటకు చాలా విశాల భావము లవసరము. అందుచే మన విద్వాంసులు సామాన్య దేవతల వలె గాక లోక కల్యాణము కోరువారు కావలె నను ప్రార్థన యీ మంత్రమునందు గలదు.

లోకమున విద్వాంసుల వల్ల ఎంతో మేలు జరుగుచున్నది. మన నిత్య జీవితము ఎంతో సుఖ ప్రదమగుచున్నది. సాంకేతిక రంగములో వారు చేసిన పరిశోధనలు మన విద్యా వినోదములకు ఎంతగానో తోడ్పడుచున్నవి. కాని యీ విద్వాంసుల వలన యింతకన్నను ఎక్కువగా లోకమునకు అపకారము జరుగు అవకాశముకూడా ఉన్నది. వారి విద్యా విజ్ఞానములను వినాశము వైపు మరలించినచో ఆ విద్వాంసులు మేలు కన్నను ఎక్కువగా లోకమునకు నష్టము చేసిన వారగుదురు. సంస్కృతములో నొక సామెత గలదు. "సాక్షరాః రాక్షసా భవంతి" – అక్షర జ్ఞానము గల విద్వాంసులు రాక్షసులు కూడా నగుదురు. ప్రాచీన చరిత్రలో రావణుడట్టి సాక్షర రాక్షసుడు. రావణుడు వేదాది శాస్త్రములన్నియు చదివియు, ఎంతో విజ్ఞాన సంపన్నుడయ్యు తన విద్యా విజ్ఞానములతో లోకములను పీడించెను. ఇట్టి వారిని ఆంగ్లములో "Intellectual monsters" అందురు. భారతదేశము శాంతి కాముక దేశము. విజ్ఞాన సాంకేతిక రంగములను, అణుశక్తిని శాంతియుత ప్రయోజనముల కొరకు మాత్రమే వినియోగించు చున్నది. కాని అమెరికా, రష్యా మొదలగు సంపన్న దేశములు ఆ విద్యా విజ్ఞానములతోనే లోక వినాశనమునకు మార్గములు వెతుకుచున్నవి. ఈ మంత్రములో 'మా విద్వాంసులు రాక్షసులు కాకుండా విశ్వదేవతలు కావలె' నను ప్రార్థన వేదముల విశాల భావమును వ్యక్తము చేయుచున్నది.

ఈ సాక్షర రాక్షసులు విజ్ఞాన రంగములోనే గాక న్యాయ రంగములో కూడా ఎక్కువగా కనబడుచున్నారు. పవిత్రమైన న్యాయవాద వృత్తి చేయుచు అన్యాయములను గెలిపించుటకు సిద్ధపడుచున్నారు. యుక్తితో గెలిపించు చున్నారు. దీనికి చరిత్రలో ఒక ప్రసిద్ధ ఉదాహరణ కలదు– ప్రసిద్ధ తత్త్వవేత్త సోక్రటీస్ మరణమునకు ప్రతిపక్ష న్యాయవాదియైన "Lycon" చేసిన వాక్

చమత్కారమే కారణమయ్యెను. కేవలము డబ్బు కొరకే అతడు ఆ పని చేసెను. సోక్రటీస్ మిత్రులు కొందరు అంతకన్నా యెక్కువగా డబ్బును లైకన్‌కిచ్చి అతని వాక్ చాతుర్యముతో సోక్రటీస్‌ను రక్షింప యత్నించిరి. లైకన్ అందుకు సిద్ధపడెను. కాని సోక్రటీసు సిద్ధపడలేదు. సోక్రటీస్ మరణముకన్న అధర్మమునకే యెక్కువ భయపడెను. వీరిలో సోక్రటీస్ విశ్వదేవత. లైకన్ స్వార్థ దేవత. అందుకే మనము సోక్రటీస్ వంటి విశ్వ దేవతలము కావలెను.

మన ప్రాచీన భారత ఇతిహాసములో సోక్రటీస్ వంటి విశ్వదేవతలు కోకొల్లలు. ప్రాచీనులు జీవితకాలమును నాలుగు భాగములుగా జేసి ఆశ్రమములను పేరిడిరి. చతురాశ్రమమైన సంన్యాసాశ్రమములో లోకసంచారము జేయుచు విశ్వమానవ కల్యాణమునకు కృషి చేసెడివారు. పక్షపాత రహితముగా అన్యాయము నెదిరించుచు ధర్మోపదేశము చేసెడివారు. వారు ఎన్నియో విజ్ఞాన గ్రంథములు వ్రాసిరి. అవి యన్నియు విశ్వ మానవుల కొరకు వ్రాయబడినవే. ఎందరో విదేశముల కేగి అక్కడనే స్థిరపడి వారి యున్నతి కొరకు ప్రయత్నించిరి. ఆధునిక కాలములో కూడా మహర్షి దయానంద సరస్వతి, స్వామి వివేకానంద, స్వామి రామతీర్థ, మహాత్మా గాంధీ మొదలగు వారు విశ్వ దేవతలని చెప్పవచ్చును. వారి ప్రబోధములు, ప్రయత్నములు విశ్వమానవ కల్యాణము కొరకే గావించబడినవి.

తదుపరి వాక్యము "శం సరస్వతీ సహ ధీభి రస్తు" –మా విద్య ధీయుతము అనగా బుద్ధితో కూడినది కావలెనని దీని భావము. లోకములో విద్యావంతులు పెక్కురు గలరు. వారిలో లోక కల్యాణమును గోరువారు కూడా చాలామంది గనబడుదురు. కాని, వివేకము కలిగిన వారు చాలా అరుదు. విద్యకన్నను బుద్ధియే యెక్కువ బలమైనది. ఒక పారసీ కవి చెప్పినట్లు 'ఒక మణుగు విద్యకు పది మణుగుల బుద్ధి అవసరమగును.' వివేకము లేని స్నేహితుని వలెనే వివేకము లేని విద్యావంతుల వలన కూడా చాలా నష్టము కలుగును. ఇటువంటి వారిని మూర్ఖ విద్వాంసులందురు. పంచతంత్రములోని మూర్ఖ విద్వాంసుల కథ ఈ విషయమును స్పష్టపరచును. ఇట్టి మూర్ఖ

విద్వాంసుల వలననే అనేక పురాణములు, అనేక కట్టు కథలు, బౌద్ధ జైనాది దర్శనములు పుట్టి లోకమున కెంతయో అపకారము జేసినవి. వేద పదములకు ఈ పౌరాణిక గాథలను జోడించి వింత వింత అర్థములను నేటికిని తీయుచున్నారు. ఇది కడు శోచనీయము.

నిత్య జీవితములో విద్యకన్న బుద్ధియే యెక్కువగా ఉపయోగ పడును. వైద్య పట్టభద్రులెందరో కలరు. కాని అందు వైద్య నైపుణ్యము కలవారు కొద్దిమంది మాత్రమే యుందురు. న్యాయ పట్టభద్రులు ఎందరో కలరు. అందు రాణించగలవారు కొందరు మాత్రమే. అట్లే అన్ని రంగములలో విద్యావంతులైనను రాణించువారు కొందరే యుందురు. ప్రపంచ వైజ్ఞానికుల జీవితములను పరిశీలించిన పెక్కురు వైజ్ఞానికులు తక్కువగా చదువుకొనిన వారే కనబడుదురు. అట్లని చదువును నిర్లక్ష్యము చేయుట తగదు. బుద్ధిగలవారు చదువు వలన మరింతగా రాణింతురు. అందుచే యీ మంత్రములో మా చదువు (సరస్వతి) బుద్ధితో కూడినది (ధీయుతము) కావలెనని ప్రార్థించ ప్రేరేపించు చున్నది.

"శమభిషాచః శమురాతిషాచః" మా అభిషాచులు అనగా మమ్మను సరించువారు. మా రాతిషాచులు అనగా మమ్ము నడిపించు నాయకులు. వీరంతా శాంతిదాయకులై మనమంతా విశ్వ దేవతలగుటకు తోడ్పడవలెనని దీని భావము. మనను అనుసరించు వారు అప్పుడప్పుడు వారి ప్రయోజనము కొరకు మనను అధర్మము చేయ ఒత్తిడి జేయుదురు. ఉదాహరణకు ఒక ప్రాంత ఓటర్లచే ఒక నాయకుడు ఎన్నుకొనబడును. ఆ నాయకుడు గెలిచిన తదుపరి మీరు మా ఓట్లచే గెలిచినవారు గాన దేశ ప్రయోజనము కన్న మా ప్రయోజనము కొరకే మీరు పాటుపడవలెనని ఒత్తిడి చేయవచ్చును. ఒక విశాల భావము కల వ్యక్తిని కుటుంబములోని మిగిలిన సభ్యులు "ఇంట గెలిచి రచ్చ గెలువ వలె" గాన ముందు మా ప్రయోజనము కొరకు పాటుపడవలెనని ఒత్తిడి చేయవచ్చును. ఇటువంటి ఒత్తిడులకు లొంగిపోక మనము విశ్వదేవతలగుటకు నేర్పుతో ప్రయత్నించవలెను. అందుకొరకే మా అభిషాచులు-మమ్మనుసరించు విద్యార్థులు, ప్రజలు, సేవకులు మొదలగు వారు శాంతి దాయకులు కావలెనని ప్రార్థన.

రాతిషాచు లనగా మనను నడిపించు పెద్దలు– తల్లి, తండ్రి, గురువు, నాయకుడు, రాజు మొదలైన పెద్దలందరు కూడా విశ్వ దేవతలై మనమంతా విశ్వదేవతలగుటకు తోడ్పడవలెనని గోరబడినది.

"శం నో దివ్యాః పార్థివాః శం నో అప్యాః" –అంతరిక్ష భూజల పదార్థము లన్నియు మాకు శాంతిని చేకూర్చు గాక ! ఈ ప్రపంచమును స్థూలముగా మూడు భాగములుగా విభజింప వచ్చును. అవి భూమి, జలము, అంతరిక్షము లేదా ఘన, ద్రవ, వాయు పదార్థములు. విజ్ఞాన వేత్తలు ఈ మూడు స్థానములలోని వివిధ పదార్థముల గుణగణముల నధ్యయనము చేసి వాటితో అనేక ప్రజోపయోగకర వస్తువులు నిర్మించిరి. వారి విజ్ఞాన ఫలితములు లోక కల్యాణము కొరకే తోడ్పడవలెనుకాని వినాశమునకు దారితీయ రాదని ప్రార్థించ బడినది.

ఈ చివరి వాక్యములోని పార్థివ, అప్య, దివ్య పదములకు మరి యొక అర్థము చెప్పుకొనవచ్చును. యోగ దర్శనములో "ప్రకాశ క్రియా స్థితిశీలం భూతేంద్రియాత్మకం భోగాపవర్గార్థం దృశ్యం" – ఈ దృశ్యమాన జగత్తు మానవులు భోగించుటకు మరియు మోక్షమును జేరుటకు సాధనము. ప్రకాశ (సత్వ), క్రియ (రజః), స్థితి (తమః) వీటి మిశ్రితమని చెప్పబడినది. పార్థివ పదార్థములు క్రియా శూన్యములుగా నుండుట మన కందరకు తెలిసినదియే. అట్లే సోమరులు, పనిదొంగలు పార్థివ మానవు లగుదురు. అప్య (జలము) తరళముగా నుండును. పాత్రలో బంధించినను ఏ కొద్ది అవకాశము దొరికినను ప్రవహించుటకే యత్నించును. ఇది రజోగుణ లక్షణము. అట్లే యెప్పుడును ఏదో చేయగోరు వారందరు అప్య మానవు లగుదురు. వీరు ఊరకనే యుండలేరు. వారి వారి సంస్కారములను బట్టి మంచి పనియో లేక చెడు పనియో చేయుచునే యుందురు. ఇక ద్యులోకములో నుండు సూర్య చంద్ర నక్షత్రములు ప్రకాశాత్మకములు – దివ్యములు. అవి లోక కల్యాణము కొరకు

నిరంతరము తపించు చుండును. అట్లే విద్యా తపో సంపన్నులు తమ విద్యా తపస్సులతో లోకమునకు ప్రకాశము నిచ్చు చుందురు. వారి సంపర్కములో అప్య, పార్థివ మానవులు కూడా దివ్యులుగా– దివ్య మానవులుగా మారి పోగలరు. వాల్మీకి నారదుని సంపర్కము వలన ఋషియై ఆదికవి యగుట, అంగుళీమాలుడు బుద్ధుని సంపర్కము వలన సత్వ గుణ సంపన్నుడగుట అందరకు తెలిసిన విషయమే. కాన దివ్య, అప్య, పార్థివ (సత్వ, రజస్, తమో గుణ) మానవులందరు విశ్వ దేవతలై మాకు శాంతిని చేకూర్చు వారు కావలె నని ప్రార్థించబడెను.

అట్టి సద్బుద్ధికై, వివేకవంతమైన మేధాబుద్ధికై ప్రతి నిత్యము గాయత్రీమంత్రముతో పరమేశ్వరుని ప్రార్థింతము రండు–

ఓ౩మ్ భూర్భువః స్వః । తత్సవితుర్వరేణ్యం ।
భర్గో దేవస్య ధీమహి । ధియో యో నః ప్రచోదయాత్ ॥

(యజుర్వేదము. 36-3)

ఓ సర్వసంరక్షక సర్వేశ్వర! సర్వాంతర్యామిన్! హే సచ్చిదానంద స్వరూపా! సృష్టికర్తయైన ఓ దేవా! నీ దివ్యము వరేణ్యమునగు విజ్ఞాన స్వరూపమును మేము నిత్యము మా హృదయమున ధ్యానింతుము గాక! అంతర్యామివైన నీవు మాకు వివేకవంతమైన సద్బుద్ధి నిచ్చి సదా సత్కర్మల యందు ప్రేరేపింతువు గాక!

మిత్రులారా ! విశ్వశాంతిని బొంద వివేకవంతులమగుచు మూడవ అడుగు వేసి ముందుకు పోదము రండు.

## వివేకవాన్ భవ - త్రిపదీ భవ

# అద్వేష్టీ భవ

## నవజాత వత్సమును గోమాత వలె తోటివారిని ప్రేమించుము

సహృదయం సాంమనస్య మవిద్వేషం కృణోమి వః ।
అన్యో అన్య మభి హర్యత వత్సం జాతమివాఘ్న్యా ॥
(అథర్వ. 3-30-1)

ఓ మానవులారా ! మీరు విశాల హృదయులు, ఆలోచనాపరులు, ద్వేషరహితులు కాగోరుచున్నాను. ఒకరి నొకరు నవజాత వత్సమును గోమాతవలె ప్రేమించుకొనుచు ఒకరి ఉన్నతికి మరొకరు తోడ్పడుచు ఉన్నతి చెందగోరెదను.

అథర్వ వేదములో నెన్నో విజ్ఞాన విషయములు ఉపదేశింప బడినవి. విజ్ఞాన విషయములతో బాటు సమాజములో మానవులు ఒండొరులతో నెట్లు మెలగవలెనో, ఏ విధముగా మెలగిన వ్యక్తిగత, సామాజిక ఉన్నతులు కలుగునో అట్టి మార్గములును ఉపదేశింపబడినవి. ఈ 30 వ సూక్తములోని ఏడు మంత్రములు సామాజిక విజ్ఞానమును ఉపదేశించును. ఈ మంత్రములకు దేవత ప్రజాపతి. అనగా నీ మంత్రములందు ప్రజలను పాలించు లేదా కాపాడు ఉపదేశములు వర్ణింపబడినవి. ఈ మొదటి మంత్రములో పరమేశ్వరుడు మానవులకు 'సహృదయం' - మీరందరు మంచి హృదయముగలవారు కావలెనని ఉపదేశించెను. ఇచ్చట హృదయ మనగా మన ఛాతిలో రక్తమును ప్రసరింపజేయు పిడికెడు పరిమాణము గల మాంస పిండము గాదు. దేని వలన జాలి, కరుణ, పరోపకారభావన కలుగునో ఆ హృదయము. అది పాంచ భౌతికమైనది కాదు. కంటికి కానరాని సూక్ష్మ శరీరములోని ఒక భాగము.

మానవుడు సంఘజీవి. పరుల సహకారములేనిది అతని జీవన యాత్ర నడవదు. మానవులమైన మనము ఒండొరుల యెడ ప్రేమ, వాత్సల్యములను కలిగి యుండవలెను. పరస్పరము సానుభూతిని వ్యక్తపరచు కొనవలెను. తోటివారు కష్టములలో నున్నప్పుడు ఆ కష్టములు మనకే కలిగినట్లుగా భావించి

వారికి సహాయపడుటకు శక్తికొలది ప్రయత్నించవలెను. శారీరకముగా, ఆర్థికముగా కనీసము ఓదార్పు మాటలతోనైన మన సానుభూతిని ప్రకటించ వలెను. ఆ విధముగా చేయని మానవుని హృదయము పాషాణ హృదయ మగును. తోటి వారికి సంతోషము కలిగినప్పుడు తనకే కలిగినట్లుగా వ్యవహరింపలేని మానవుడు కూడా సానుభూతి లేని వాడగును. లేకున్న అసూయ ద్వేషములు మన మనసును కలుషితము చేసి మనలను పతితులను జేయును. అందుచే పరమేశ్వరుడు మానవులను ముందుగా మీరు మంచి హృదయము కలవారు కావలెనని బోధించెను.

'సాంమనస్యమ్' - ఆలోచనా పరులు కండు. కేవలము ప్రేమతో కూడిన విశాల హృదయమే సరిపోదు. ఆ హృదయము బుద్ధితో కూడినదై యుండవలెను. లేకున్న ప్రమాదకారియగును. లోకములో నొక సామెత గలదు. "బుద్ధిలేని స్నేహితుని కన్న బుద్ధి గల శత్రువే మేలు" అని. ఉదాహరణకు నీవు నిదురించునపుడు నీ ముఖముపై నొక కీటకమెగురుచు నిన్ను కుట్టుటకు ప్రయత్నించుటను నిన్ను ప్రేమించు బుద్ధిలేని ఒక స్నేహితుడు చూచిన వెంటనే ఒక రాయితో నా కీటకమును వెళ్ళగొట్టును. ఆ కీటకము దూరముగా పోయినను నీ ముఖమునకు గాయమగును. ఇది బుద్ధిలేని విశాల హృదయమున కొక యుదాహరణ. బుద్ధి గలిగిన శత్రువు తన ప్రయోజనము కొరకైనా నీతో స్నేహము జేయును. అట్టి శత్రువును నీవు కనిపెట్టి యుండ గలుగుదువు. ప్రమాదము నుండి రక్షించు కొనుటకు కొన్ని ఏర్పాట్లు చేసికొని యుందువు. కాని యీ బుద్ధిలేని స్నేహితుని వలన ఎప్పుడైనను అకస్మికముగా ప్రమాదము రావచ్చును. మన చరిత్రను పరిశీలించిన ఇట్టి విశాల హృదయముతోనే వివేకము లేని కొందరు మన దేశము ననేక సార్లు బానిస దేశముగా జేస్తిరి. అందుచేతనే పరమేశ్వరుడు విశాల హృదయముతో బాటు 'సాంమనస్యమ్' అనగా మీరు ఆలోచనాపరులై కార్యములను సాధించుడని హెచ్చరించెను.

'అవిద్వేషమ్' – ద్వేష రహితులు కండు. ఈ విశాల హృదయము, ఆలోచనతో గూడిన ప్రయత్నము మనలో ద్వేషభావము లేనప్పుడే సంభవమగున .

మానవుడు సహజముగా సానుభూతి గలవాడే. ఏదో ద్వేష కారణముగా ఈ సానుభూతి లోపించి యితరుల కపకారము చేయ యత్నించును. అందుకే మీరు ద్వేష రహితులు కండని పరమేశ్వరుని ప్రబోధము. ద్వేష మనగా ప్రేమకు వ్యతిరేక గుణము. మనవా రనుకొనినప్పుడు తోటివారిపై ప్రేమ కలుగును. మనవారు కాదను కొనినప్పుడు వారిపై ద్వేషము కలుగును. ఈ ద్వేషమే మనచే పాపకర్మలు చేయించును. అవే మన కష్టములకు కారణమగును. మన ప్రాచీన ఋషులు ఈ ద్వేష భావమును దూరము చేసికొనుటకు విశేష ప్రయత్నము చేయవలెనని సూచించిరి. వారు నిర్మించిన సంధ్యావందనములో ఉదయ సాయంకాలములందు నీ ద్వేషభావము దూరమగుటకు గట్టి సంకల్పము చేసికొనవలెనని అథర్వ వేదములోని మనసా పరిక్రమా మంత్రములను నిర్దేశించిరి. ఎంత జాగ్రత్తగా నున్నను ఏ మూలనుండియో యీ ద్వేష భావము మనలో ప్రవేశించు నవకాశమున్నది. అందుచే మనకు నాలుగు దిక్కులలో క్రిందా, పైనా కలిపి మొత్తము ఆరు దిక్కుల యందు పరమేశ్వరుడు వ్యాపించి మనను కాపాడుచున్నాడనియు, ఈ ప్రాణులన్నియు ఆ పరమేశ్వరునకు బిడ్డలేననియు, ఇందు కొందరిపై ప్రేమ కొందరిపై ద్వేషము పరమేశ్వరునకు లేదనియు, తోటి ప్రాణులను ప్రేమించుట వలననే భగవంతునకు సన్నిహితులము కాగలమనియు నమ్మి ప్రాణులను ప్రేమించ సాధన చేయవలెను. ప్రేమను దూరముజేయు ద్వేషభావము మా నుండి దూరము గావలెనని నిత్యము పరమేశ్వరుని ప్రార్థించవలెను. ఉదయ సాయంకాలములందు "యో అస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మస్తం వోజంభే దధ్మః" - ఎవరు మమ్ము ద్వేషించు చున్నారో, యెవరిని మేము ద్వేషించు చున్నామో వా యిరువురి యందు అట్టి ద్వేషభావము దూరమై అన్యోన్యత పెరిగి, సామాజిక జీవనము సుఖప్రదము కావలెనని సంధ్యావందనములో మనసా పరిక్రమ మంత్రములతో ప్రార్థించ వలెను. మనకు ద్వేషభావము లేకున్నను, ఇతరులకు మనపై ద్వేషమున్నను సక్రమముగా జీవించలేము. అందుచే ఇద్దరి యందు ద్వేషభావము రాకుండుటకై యత్నించవలెను.

ప్రేమకు ప్రతీక హృదయము. ఆలోచనలకు ప్రతీక మనస్సు. విశ్వహిత భావనకు ప్రతీక అవిద్వేషత. ఈ మూడును కలిగి యుండుటయే ఆదర్శ పురుష లక్షణము. విశాలహృదయము, ఆలోచనలతో కూడిన ప్రయత్నములు, వీటితోపాటు ద్వేషరహితమైన మనస్తత్వము కలిగి పరస్పరము సత్కరించుకొనవలెను.

"అన్యోఅన్య మభిహర్యత" ఈ 'అభిహార్య' పదము 'వ్యవహార' పదము కంటె విశేషార్థము గలది. వ్యవహారము మంచిది కావచ్చును లేదా చెడ్డది కావచ్చును. కాని మంచి వ్యవహారమును మాత్రమే అభిహార్య మందురు. ఒక రకముగా యిది గౌరవించుకొనుట యగును. ఈ అభిహార్య మెటులుండ వలెనో పరమేశ్వరుడు ఒక చక్కటి ఉపమానము ద్వారా తెలుపుచున్నాడు. వేదములలో చెప్పబడిన ఉపమానములన్నియు వాటికవియే సాటిగా నుండును. అంతకు మించిన మరియొక యుపమానమును మనము చూపలేము. ఆ ఉపమానములు కూడా నిత్య జీవితములో తరచు కనబడునవియే. ఇచట పరమేశ్వరుడు అట్టి ఉపమానమునే చెప్పుచున్నాడు– "వత్సం జాత మివాఘ్న్యా" నవజాత వత్సమును (శిశువును) గోవు ప్రేమించునట్లు మీరు ఒండొరులను ప్రేమించుకొనుడు.

ముందుగా మనము "అఘ్న్యా" పదమును గురించి కొంత తెలిసి కొనవలసి యున్నది. ఇచట అఘ్న్యా పదము యోగారూఢిగా వచ్చినది. దీని మూలార్థము (యౌగికార్థము) చంపరానిది, హింసించరానిది యని. భగవంతుని యీ సృష్టిలో అపకారము జేయని యే ప్రాణిని మనము చంపరాదు. తేలు, పాము, పులి, సింహము మొదలగు జంతువులకు కూడ అవి మనకు అపకారము చేయునను అనుమానము కలిగినప్పుడు మాత్రమే చంపుటకు ఆదేశము గలదు. ఈ ధాత్వర్థమును బట్టి యీ పదము కుక్క, పిల్లి, మేక మొదలగు పెంపుడు జంతువుల కన్నింటికిని వర్తించును. కాని యిచట యోగారూఢి అర్థమున నిది గోవును నిర్దేశించు చున్నది. ఏలయన చంపరాని జంతువులలో గోవు మొదటగా పేర్కొనదగినది. అది మనకు తల్లి వంటిది. ఎందుచేతననగా మనకు తల్లిపాలు

ఒక సంవత్సరము వరకు ఆహార మగును. తదుపరి జీవితాంతము ఆవు పాలు ఆహారముగా నుపయోగపడును. పాలు సంతులితమైన తేలికగా జీర్ణమగు ఒక చక్కటి ఆహారము. తల్లిపాల తదుపరి పేర్కొనదగిన ఆహారము ఆవు పాలు. తల్లిపాలు త్రాగిన మనము ఆమె యెడ స్పర్శ భావన (రక్త స్పర్శ) కలిగి యుందుము. మనకు ఆమె పూజ్యురాలు. అట్లే ఆవుపాలు త్రాగిన మనము ఆవుపైన పూజ్యభావము కలిగి యుండుట ధర్మమగును. పాలు ఇచ్చు ప్రతి జంతువుపట్ల ఇట్టి భావనయే అవసరము. అందు భారతీయులు ఎక్కువగా ఆవు పాల నుపయోగింతురు గాన ఆవు వారికి గోమాత.

ఇచట తల్లి బిడ్డను ప్రేమించునట్లు అని చెప్పక నవజాత వత్సమును (దూడను) గోవు ప్రేమించునట్లు అని చెప్పబడినది. ఏలయన మానవ స్త్రీ కన్న గోవు నవజాత శిశువును ఎక్కువగా ప్రేమించును. గోవు తనకు అప్పుడే పుట్టిన బిడ్డను ప్రేమించుటలో మనము అనుసరించదగిన ఒక విశేషత యున్నది. గోవు బిడ్డకు జన్మనిచ్చినపుడు గోవు యొక్క భావనలను పరిశీలించు చుండిన మీ కీ విషయము అర్థమగును. మానవ స్త్రీ బిడ్డకు జన్మనిచ్చి అలసి సొలసి అచేతనముగా నున్నప్పుడు వైద్యుడు లేదా పరిచారకులు ఆ బిడ్డను శుభ్రమైన బట్టతో తుడిచి నవరంధ్రములలో నుండు శ్లేష్మాది పదార్థములను తీసి శుభ్రము చేయుదురు. ఎందుచేత ననగా బిడ్డ తల్లి గర్భములో పెరుగునపుడు ఒక కోశము (జరాయుజము)లో పెరుగును. అందు బిడ్డకు కుదుపు తగలకుండా నొక ద్రవ ముండును. ఆ ద్రవము బిడ్డ లోపలకు పోకుండా నవరంధ్రములయందు శ్లేష్మపు పొర అడ్డుగా నుండును. పుట్టిన వెంటనే ఆ బిడ్డను శుభ్రము జేయుట (అట్టి ఏర్పాట్లు చేయుట) తల్లి మొదటి కర్తవ్యము. తదుపరి ఆహారము గురించి ఆలోచించవలెను. ఆరోగ్య దృష్టితో కూడా స్నానానంతరమే భోజన ప్రసక్తి వచ్చును. మంచి పాలైనను చెడు పాత్రలో పోసిన చెడిపోవునట్లే మంచి ఆహార మైనను మలములతో గూడిన శరీరములో పడి వాటి గుణములను సంతరించుకొనును. కనుక మొదట శుభ్రతకు ప్రాధాన్యత నివ్వవలెను. కాని గోవు వద్ద తన బిడ్డను శుభ్రము జేయుటకు వైద్యులు, పరిచారకులు నుండరు. గోవుకు కనీసము చేతులు కూడా లేవు. కాని ఆవుకు తన బిడ్డపైన అపారమైన ప్రేమ యున్నది.

ఆ ప్రేమయే ఆవుకు సాధ్య సాధనము. ఆ ప్రేమతోనే గోమాత బిడ్డపైనున్న అసహ్యాకరమైన మలములను తన నాలుకతోనే నాకి, నాకి శుభ్రము చేయును. మైల పదార్థములను చేతులతోనే గాక కాళ్ళతో కూడ తాకుటకు మనము అసహ్యాపడెదము. కాని గోవు తన నాలుకతో ఆ మైల పదార్థమును నాకుట ప్రేమ, వాత్సల్యములకు అత్యంత ఉన్నతమైన ఉదాహరణ యగును. మైలను పూర్తిగా నాకిన అనంతరమే దాని ఆహారమును గురించి ఆలోచించును. బిడ్డపై నున్న ప్రేమయే పాల నుత్పత్తి జేయును. అంతేగాక ఆవు తన బిడ్డ జోరుగా తన స్తనముల కుడుచు చున్నప్పుడే పాలను చేపును. అంతకు ముందు మనము ఎంత ప్రయత్నించినను పాలను పిండలేము. అనగా ఆ గోమాతకు తన బిడ్డయే పాలు త్రాగవలెనను కోరిక అమితముగా నున్నట్లు గనబడుచున్నది.

ఈ పై దృష్టాంతము ద్వారా పరమేశ్వరుడు మానవులకు ఒక విశాల ఆదర్శమును ప్రబోధించుచున్నాడు. గోమాత మనకు రెండు విషయముల నుపదేశించుచున్నది. మానవులు తమ పరిసరములలో తమకన్న తక్కువ స్థాయిలో నున్న వ్యక్తుల కొరకు రెండు పనులు చేయవలసి యున్నది. ఒకటి వారి పరిశుభ్రత కొరకు ప్రయత్నించుట, రెండవది వారికి తగిన ఆహార మిడుట. ఆహారము కంటె ముందుగా గుర్తించవలసినది శుద్ధత.

గోవు పశువు కనుక కేవలము శారీరక శుభ్రతకే యత్నించును. బుద్ధి గల మానవుడు అన్ని రకముల అనగా శారీరక, మానసిక, సామాజిక మలములను దూరము చేయ ప్రయత్నించవలెను. తనకు తాను శుభ్రముగా నుండుట మంచిదే కాని అంత కంటెను ఇతరులను కూడా శుభ్రముగా నుంచుట ఎక్కువ అవసరము. డాక్టరు తన శరీరమును, దుస్తులను, పరికరములను శుభ్రముగా నుంచుకొనవలెను. అయినప్పటికి అవసరమైనపుడు రోగుల మల, మూత్ర, శ్లేష్మాది పదార్థముల తొలగించుటకు తన దుస్తులు పాడగుచున్నను వెనుకాడరాదు. అట్టివాడే నిజమైన వైద్యుడు.

సాధారణముగ తల్లి తన బిడ్డ మలములను తొలగించుటకు అసహ్యా పడదు. కాని కొందరు భాగ్యవంతులైన స్త్రీలు తమ బిడ్డలకు పరిచారకుల చేతనే

సేవలు చేయింతురు. పరిచారికలే బిడ్డలను పోషింతురు. కాని, తమ దుస్తులు పాడగుచున్నవని బిడ్డను అపరిశుభ్రముగానుంచు తల్లి తల్లి కాదు. మహారాణి స్థానము కంటెను తల్లి స్థానము ఎన్నో రెట్లు గొప్పది. గోమాత వోలె నీ తోటి మానవులలోని అపరిశుభ్రత, అవిద్య, అజ్ఞానము, దారిద్ర్యము మొదలగు మలములను తొలగించవలెనని ఈ ఉపదేశము ద్వారా గ్రహించవలెను.

తదుపరి ఆహారమును గురించి ఆలోచించ వలెను. కొందరు ధనవంతులు పుణ్యము వచ్చునను ఆశతో దాన ధర్మములు చేయు చుందురు. వారిలో వివేచన యుండదు. అపాత్రులకు గూడ దానము చేయు చుందురు. అందువలన వారు సోమరితనమును ప్రోత్సహించినవా రగుదురు. ఈ సోమరితనము దేశమున కరిష్టదాయకము. మనము పరోపకారము కూడా బుద్ధితో నాలోచించి చేయవలసి యున్నది. ఇది మానవులందరికి పరమేశ్వరుడు చేసిన ఉపదేశ మైనప్పటికి ముఖ్యముగా నీ సందేశమును వేదాధ్యయమునకు తమకే అధికారము కలదని వాదించు బ్రాహ్మణులనుసరించవలసి యున్నది. ముందుగా వారు అంటరాని తనమును దూరము చేసి వారికి తమ యొద్దనున్న వేద జ్ఞానము నందించ వలసి యున్నది. అస్పృశ్యులని భావింపబడు వారిని స్పృశ్యులుగా జేయుట వారి మొదటి కర్తవ్యము. వారికి ఆవాస, వస్త్ర ఆహారాదులనిచ్చి (అట్లు చేయుడని ప్రజలకు ప్రబోధించి) తమ వేద జ్ఞానమును వారి కుపదేశించ వలెను. వారిలోని చెడు గుణ కర్మ స్వభావములను సంస్కరించి వారిని ఉత్తమ మానవులుగా తీర్చి దిద్దవలెను. అప్పుడే వారి వేదాధ్యయనము సఫల మగును. నవజాత వత్సము-ఆవుదూడ మైలతో అపరిశుభ్రముగా తాకుటకు కూడా అసహ్యముగా నుండును. ఆవు అట్టి బిడ్డను తన పవిత్రమైన నాలుకతో శుభ్రపరచినట్లే వీరును అసహ్యపడక తగిన రీతిని వారిని సంస్కరించి (శుభ్రపరచి) తమ వేద జ్ఞాన మను ఆహారము నొసంగవలెను.

దయామూర్తియైన మహర్షి దయానందుడు కాల ప్రవాహములో మన సంస్కృతీ సభ్యతలకేర్పడిన మలములను తొలగించుట కెంతగానో కృషి చేసెను. ఎంతో కాలముగా దాచి పెట్టబడిన వేద సందేశాన్ని జ్ఞానాన్ని వెలుగులోనికితీసుకొని

వచ్చెను. వారు ఈ వేద సందేశాన్ని తూ.చ. తప్పకుండా అనుసరించిరి. వారి అడుగుజాడలలో ఈ వేద సందేశాన్ని అనుసరించుటకే స్వామి శ్రద్ధానందుడు తన సర్వస్వాన్ని అర్పించుకొనెను. బలాత్కారము వలన, ప్రలోభము వలన, అజ్ఞానము వలన మన మతాన్ని వీడి అన్యమతాలలో కలిసి పోయిన సోదర భారతీయుల మనో మాలిన్యములను దూరము చేసి వారి యున్నతికై శ్రద్ధానందుడు మొదలగు ఆర్యవీరు లెంతగానో కృషి చేసిరి.

అస్పృశ్యతా నివారణకు పాటుపడిన మరియొక మహాపురుషుడు జాతి పితగా ప్రసిద్ధి జెందిన మహాత్మ గాంధి. వారు ఒక ప్రక్క స్వాతంత్ర్య సంగ్రామము చేయుచునే అంటరానితనముపై పోరాటము సలిపిన మహానుభావుడు. అస్పృశ్యల యుద్ధరణకై జాతిని ప్రబోధించెను. శాసనములు చేయించెను. పవిత్ర భావముతో వారికి హరిజనులని-పరమేశ్వరుని బిడ్డలని నామకరణము చేసెను. కాని, దురదృష్టవశాత్తు 'హరిజన' పదము అస్పృశ్యతకు ఒక పర్యాయపదముగానే మిగిలిపోయినది. హరిజనుల కాలనీలు, సేవా కేంద్రాలు, వసతి గృహాలు వారిని వేరుగానే ఉంచినవి. వారిని జాతీయ జీవన స్రవంతిలో కలిపివేయలేక పోయినవి. మహర్షి దయానందుని అనుయాయులు అట్లుగాక అస్పృశ్యలను ఆర్యులుగా చేసిరి. వారిని గురుకులాలలో చేర్పించి వేదపండితులను చేసి పురోహితులుగా, ధర్మప్రచారకులుగా, శాస్త్రార్థములు చేయగల తార్కిక పండితులుగా తీర్చి దిద్దిరి. అదే గొప్ప ఆదర్శ సంస్కరణ. అదే 'వైదిక క్రాంతిపథం'. ఆ మార్గమున పయనింతము రండు.

## అద్వేష్టీ భవ - చతుష్పదీ భవ

> దృతే దృంహ మా మిత్రస్య మా చక్షుషా సర్వాణి భూతాని సమీక్షన్తామ్।
> మిత్రస్యాఽహం చక్షుషా సర్వాణి భూతాని సమీక్షే మిత్రస్య చక్షుషా సమీక్షామహే॥
>
> —యజుర్వేదము *(36-18)*

# మధురభాషీ భవ

## మిత మధురభాషివై ఐశ్వర్యమును బొందుము

సక్తుమివ తితఉనా పునన్తో యత్ర ధీరా మనసా వాచమక్రత ।
అత్రా సఖాయః సఖ్యాని జానతే భద్రైషాం లక్ష్మీ ర్నిహితాధి వాచి ॥
(ఋ. 10-71-2)

సత్తు పిండిని జల్లెడ పట్టి పొల్లును, బరకను తొలగించునట్లు జ్ఞాన యుక్తమైన బుద్ధితో ధీరులు (బుద్ధిమంతులు) వ్యర్థ, అప్రియ వాక్కులను తొలగించి మధురముగ భాషింతురు. అట్టి వాక్కునందే సన్మిత్రులు మిత్రతను దర్శింతురు. భద్రమైన లక్ష్మి మధుర వాక్కునందే గలదు.

లోకములో మానవులంతా మొదటగా ధనమునే కోరెదరు. అది నేడు లోకమున మొదటి అవసరము కూడా. చాణక్యాది నీతివేత్తలు 'సుఖస్య మూలం ధర్మః' సుఖాలకు ములం (కారణం) ధర్మ మనియు, 'ధర్మస్య మూల మర్థః' ఆ ధర్మమునకు మూలం అర్థం అనగా ధన మనియు ధనము యొక్క అవసరము గురించి నొక్కి వక్కాణించి యున్నారు. మనువు తన ధర్మ శాస్త్రము నందు "బ్రహ్మీ ముహూర్తే బుధ్యేత ధర్మార్థౌ చాను చింతయేత్" - బ్రాహ్మీ ముహూర్తమున మేల్కొంచి ధర్మముతో బాటు అర్థ చింతన కూడ చేయమని ఉపదేశించెను. చతుర్విధ పురుషార్థములలో అర్థము రెండవది. లక్ష్మీవిహీనుడు లోకమున అసమర్థుడగుచున్నాడు. లక్ష్మీ సంపన్నుడు లోకమున విద్వాంసునిగా, ప్రతిష్ఠావంతునిగా, భద్ర పురుషునిగానెంచబడుచున్నాడు. ఇటులుండ ధనమును గోరుటలో తప్పేమి గలదు ?

వేదము కూడా "శత హస్త సమాహర, సహస్ర హస్త సంకిర" ధర్మ మార్గమున నూరు చేతులతో సంపాదించి, వెయ్యి చేతులతో ధర్మ కార్యముల వితరణ చేయుమని ఆదేశించు చున్నది. అట్టి లక్ష్మీ ప్రాప్తికి పలువురు పలు

ఉపాయములు చెప్పియుండిరి. వేద భగవానుడు చెప్పిన ఉపాయ మేమియో ఈ మంత్రమున తెలిసికొందము.

మధుర వాక్కులో ఆ లక్ష్మి (ధనము) నెలకొని యున్నదనియు ఆ వాక్కు ఎటులుండ వలెనో యొక ఉపమానము ద్వారా ఈ మంత్రము తెలుపుచున్నది. "సక్తుమివ తితఉనా పునంతః" - సత్తు పిండిని జల్లెడ పట్టి ఉపయోగించుచున్నట్లు "మనసా వాచ మక్రృత" - వాక్కు లను పిండిని బుద్ధియను జల్లెడతో జల్లెడపట్టి ఉపయోగించ వలెనని వివరించు చున్నది. ఇందు ఉపమాలంకారము గలదు. విద్వాంసులు ఒక విషయమును వివరించుటకు, తెలిసినవారు తెలియనివారికి తెలియబరచుటకు నాలుగు ప్రమాణములను (జ్ఞాన సాధనములను) ఉపయోగింతురు. అవి 1. ప్రత్యక్షము, 2. అనుమానము, 3. ఉపమానము, 4. శబ్దము. ఇందు ప్రత్యక్షము ముఖ్యమైనది. ప్రత్యక్షమనగా ప్రతి అక్షముతో (ప్రతి ఇంద్రియముతో) కలుగు జ్ఞానము. వస్తువు ఇంద్రియములతో తెలిసికొన దగినదై యెదురుగా నున్నపుడు మరియొక ప్రమాణము అవసరముండదు. అట్లుగాక వస్తువు ఎదురుగ లేనప్పుడు లేదా బాహ్యేంద్రియములకు కానరాక సూక్ష్మమైనపుడు మిగిలిన మూడు ప్రమాణములు అవసర మగును.

దార్శనికులు కొందరు వస్తువు ప్రత్యక్షమే కానప్పుడు మరియొక ప్రమాణముతో సిద్ధింప జేయుట తగ దందురు. అన్ని ప్రమాణములకు ప్రత్యక్ష మాధారము గనుక అట్టి ఆధారమే లేనప్పుడు ఆధేయ మెట్లుండునని వారి వాదన. జైనులు మొదలగు నాస్తికులు ఈ విధముగా వాదింతురు. దీనికి ఉదాహరణముగా పరమేశ్వరుని చెప్పుదురు. పరమేశ్వరుడు ఇంద్రియ గోచరుడు కాడు గనుక మరియొక ప్రమాణముతో సిద్ధింప ప్రయత్నించుట తగ దందురు. ఇది వారి అజ్ఞానము. ఇచట ఒక విషయము స్పష్టపరచవలసి యున్నది. మిగిలిన ప్రమాణములు ప్రత్యక్షముపై నాధారపడి యున్నను ప్రమాణ ప్రమేయములలో భేదము గలదు. ప్రమేయమే (లక్ష్య వస్తువు) ప్రత్యక్షమైనపుడు ప్రమాణ మొక్కటి మాత్రమే యుండవలెను. నాలుగు లేదా యెనిమిది ప్రమాణము

లెందుకుండును ? మన ఇంద్రియ గోళకములతో ప్రత్యక్షము కాని మనస్సు, జీవాత్మ, ఆకాశము మొదలగు కొన్ని పదార్థములు లోకమున నున్నవి గదా ! గాన పై నాలుగు ప్రమాణములును అవసరమే.

ఇచట ఉపమాన ప్రమాణ మనగానేమో కొంత తెలిసికొన వలసి యున్నది. సాధారణముగా ఉపమానముగా చెప్పు వస్తువులలోని కొన్ని ధర్మములు ప్రమేయ (లక్ష్య) వస్తువు నందుండ వలెను. లోకములో నేవో కొన్ని సాధర్మ్యములు లేని వస్తువులు లేనే లేవు. ఆవు తోకకు యేనుగు తొండమునకు చాలా భేదమున్నను రెండును పంచభూతములతోనే నిర్మిత మగుట వలన నిది వాటి రెండింటిలోను సాధర్మ్యమగును. కాని ఉపమానము చెప్పునపుడు సాధర్మ్యము ప్రసిద్ధమైనదిగా నుండవలెననియు మరియు లక్ష్యమును గుర్తింప జేయునదిగా నుండవలెననియు 'ప్రసిద్ధ సాధర్మ్యాత్ సాధ్యసాధన ముపమానమ్ .....' (న్యాయదర్శనం 1-1-6)అని గౌతమ మహర్షి సూత్రీకరించి యుండెను. ఇచట 'ప్రసిద్ధ' యను పదము ముఖ్యమైనది. సాధర్మ్యముతో బాటు లక్ష్యము సాధించుట కుపయోగపడు సాధర్మ్యమై యుండవలెను. తెలియని వస్తువును (లక్ష్యమును) సాధించుటకు సాధ్యమైన తెలిసిన వస్తువును ఉపమానముగా చెప్పవలెను. ఈ మంత్రము బాహ్యేంద్రియములతో తెలియబడని మనసు, బుద్ధి, వాక్కు లను తెలియని వస్తువులను తెలుపుటకు అందరికి తెలిసిన సత్తుపిండిని ఉపమానముగా పేర్కొనినది. అట్లు కాకున్న ఉపమానము ప్రమాణము కాదు. ఉదా : అతిథి గృహము విడిచి వెళ్ళునపుడు యజమానిని సంతృప్తి పరచుటకు "మీ యింట స్వర్గములో నున్నట్లున్న" దని చెప్పును. తాను పొందిన సుఖమునకు స్వర్గమును ఉపమానముగా చెప్పుట జరిగినది. ఇట్టివి ఉపమానములు కావు. ఎందుచేత ననగా స్వర్గమును తాను ముందు చూచి యుండలేదు గదా ! అట్లే ఈ పాయసాన్నము అమృతము వలె నుండు ననుటయు అట్టిదియే. స్వర్గము, అమృతము అనునవి ధూర్త పండితుల కల్పనలు గాని యథార్థముగా అవి లేవు. సుఖముల నిచ్చు దేహమే స్వర్గము. పరమేశ్వర ప్రాప్తియే అమృతము.

అట్టి దోషములు లేని ఉపమానములతో వేద భగవానుడు లక్ష్మిని (ఐశ్వర్యమును) పొందు ఉపాయము చెప్పుచున్నాడు. సత్తుపిండిని శుభ్రము జేయుటకు జల్లెడ పట్టెదము. ఎందుకనగా పిండిలోని పొట్టు, రాళ్ళు, ఇనుప ముక్కలు (మరలోనివి) మొదలగు నితర అవాంఛిత పదార్థములను తొలగించుటకు మరియు మెత్తగా కాని ధాన్య భాగమును - బరకను తొలగించుటకు. అట్లు తొలగించకుండిన వండిన పదార్థములు మాధుర్యమును గోల్పోవుటయే గాక తినుటకు కఠినముగ నుండును. మన వాణిలో కూడా నిట్టివే రెండు రకముల దోషము లుండును. అందు మొదటివి వ్యర్థమైన వాక్కులు (ముఖప్రీతి వచనములు, గప్పాలు, సందర్భ రహిత విషయములు మొదలగునవి). రెండవవి ఇతరులకు కష్టమును కలిగించు వాక్కులు.

పిండిలో వ్యర్థ పదార్థములు చేరునట్లే వాణిలో కూడా వ్యర్థ వాక్కులు దొరలు చుండును. ఇవి మనోరంజకముగా నున్నప్పటికి వాస్తవమునకు దూరముగా నుండుట వలన భ్రమ ప్రమాదములకు దారి తీయును. చొల్లు కబుర్లు చెప్పువారి మాటల కేమి విలువ యుండును ? ఇటువంటి సోది మాటలు విన్న కాలము వ్యర్థమగుటయే గాక పురుషార్థము కూడా కుంటువడును. వాణి (వాక్‌శక్తి) పరమేశ్వరుడు మానవుల కిచ్చిన గొప్ప వరము. ఆ వాణిని సదుపయోగము చేసికొనకున్న ప్రయోజన మేముండును ?

ఈ విషయములో ఇంగ్లాండు రాజు కెన్యూట్ కథ ప్రసిద్ధము. అతని కొలువులో నున్న భట్టులు (పొగుడుటయే వృత్తిగా గలవారు) అతనిని ఇంద్రుడు చంద్రుడనియు, భగవంతుడే అనియు, నాతని యాజ్ఞను అష్ట దిక్పాలకులు, సూర్య చంద్రులు, భూ సముద్రములు పాలించు ననియు పొగడు చుండెడి వారు. ఒకరోజు ఆ భట్టులను పిలిచి సముద్ర తరంగములు నా సింహాసనమును తగులునట్లు చేయుమని యాదేశించెను. అందుకు వారు సముద్ర తరంగములు దర్బారున కెట్లు వచ్చునని సందేహము వెలిబుచ్చిరి. నా ఆజ్ఞగా సముద్రునితో చెప్పుడని ఆజ్ఞాపించెను. అందుకు వారు సముద్రుడు మీ ఆజ్ఞను పాలించునా? అని సందేహము ప్రకటించిరి. దానికి రాజు మీరే గదా ప్రతి రోజు నా యాజ్ఞను

సముద్రుడు కూడా పాలించునని పొగడుచున్నారు. ఎందుకు ఇట్టి యసత్యములు చెప్పుదురు ? అని గద్దించెను. వివేకవంతు లందరు యిట్లు వ్యవహరించిన ముఖ ప్రీతి వచనములు, వ్యర్థ ప్రసంగములు తొలగిపోవు చుండును. ఇంతేగాక అధిక ప్రసంగము ఆయుక్షీణము. మితభాషిత్వమే సభ్యతా సూచకము.

వాణిలోని రెండవ దుర్గుణము అప్రియ భాషణము. మనువు వాణిని గురించి చెప్పుచు "సత్యం బ్రూయాత్, ప్రియం బ్రూయాత్" సత్యము పలుకవలెను. కాని అది ప్రియముగా నుండవలెనని హెచ్చరించి యుండెను. లేకున్న జగడములకు కారణమగును. ప్రియముగాలేకున్న ఎదుటి వ్యక్తికి బాధ కలుగును. గ్రుడ్డివానిని 'ఓ గ్రుడ్డివాడా' యని పిలిచిన అది సత్యమైనను అతనికి బాధ కలుగును. అది జగడమునకు కూడా కారణమగును అందుచేతనే మనువు "న బ్రూయాత్ సత్య మప్రియమ్" అప్రియమైన సత్యమును పలుక వద్దని హెచ్చరించెను.

"భద్రా లక్ష్మీః నిహితాధి వాచి" నీకు మేలు జేయు భద్రమైన లక్ష్మి ప్రియమైన సత్యవాక్కు నందే గలదు. సత్యము లక్ష్మిని యివ్వ గలదా ? యని పలువురి సందేహము. నేటి ప్రపంచ వ్యవహారములో సత్యము కొరగానిదిగా నున్నది. సత్యము పలుకువాడు హరిశ్చంద్రుని వలె కష్టముల పాలగును. 'వృత్తిలో, వ్యాపారములో సత్యము పలికి యెంత లక్ష్మిని పొందగలము ? అసత్యము పలికియే పలువురు ధనవంతులగుట ప్రత్యక్షముగా చూచుచున్నాము కదా ?' అని పెక్కురు సందేహము వెలిబుత్తురు. కాని ప్రశాంతముగా నాలోచించిన సత్యము వలన ముందు కొన్ని కష్టములు కలిగినను తరువాత నిన్ను లోకము గుర్తించును. ప్రజలకు నమ్మకము కలిగి వ్యాపారము వృద్ధి జెందును. వృత్తి గుర్తింపబడును. నిజాయితీతో నీవు నిర్మించిన వస్తువులకు గిరాకీ పెరుగును. అటుల పొందిన ధనముతో నిర్భయముగా సుఖముల ననుభవించగలవు. అది భద్రమైనది. రాబోవు జన్మలలోను అది సుఖముల నిచ్చును. అసత్యముతో సంపాదించిన ధనము, సుఖములు కాలాంతరమున దుఃఖములకు కారణ మగును. అవి వారి అంతరాత్మను పీడించును.

అసత్యముతో లక్ష్మిని పొందువారు కాలాంతరమున లేదా జన్మాంతరమున కష్టముల బాలుగాక తప్పదు. 'అవశ్యమేవ భోక్తవ్యం కృతం కర్మ శుభా శుభమ్' అను నీతివచనం మరువరాదు.

అందుచేతనే ఈ వేదమంత్రము వాణిని జల్లెడ పట్టుమని బోధించు చున్నది. వాణిని జల్లించు జల్లెడ యేది ? అను ప్రశ్నకు సమాధానముగ నీ మనసే (బుద్ధియే) ఆ జల్లెడ యని వివరించుచున్నది. మాట్లాడబోవు వాణిలోని వ్యర్థములు మరియు కర్కశములు నైన మాటలను నీ బుద్ధితో తొలగించి ప్రియమైన సత్యమును పలుక మనుచున్నది. లోకములో పదార్థములను శుద్ధ పరచుటకు వివిధ రకముల జల్లెడలు, చేటలు మొదలగునవి యున్నట్లే వాణిలోని వ్యర్థ, అసత్యములను తొలగించుటకు తర్కశాస్త్రములు నిర్మించ బడినవి. న్యాయ దర్శనములోని మొదటి సూత్రము 'ప్రమాణ' పదముతో ప్రారంభింపబడి పదహారు ఉపాయములను తెలియపరచి వాటి వలన నిశ్శ్రేయసము (మోక్షము) కూడా లభించునని చెప్పును. ఈ వేద మంత్రము గూడ తర్క యుక్తమైన బుద్ధితో భద్రమైన లక్ష్మిని (మోక్షమును) పొంద వచ్చునని చెప్పును. అనగా నెవరు తమ తర్కయుక్త బుద్ధితో వాణిని పలికెదరో అట్టి వారు పరమ శాంతిని పొందెదరు.

అట్టి మధురమైన వాణివలన పొందు మొదటి లాభమును గురించి మంత్రము ఈ విధముగ వివరించును. "అత్రా సఖాయః సఖ్యాని జానతే"- దాని వలన సన్మిత్రులు మిత్రతను అనగా స్నేహితమును తెలిసి కొనగలరు. తమ విద్య వలన లోకములో శాంతిని స్థాపించగలరు. బుద్ధి హీనతతో మాట్లాడినవారు అశుద్ధమైన పిండివలె కష్టముల పాలగుదురు. అందరకు తెలిసిన కథయే–ద్రౌపది తన అజ్ఞానముతో, బుద్ధిహీనతతో మయ సభలో దుర్యోధనుని యవస్థను జూచి "అంధులకు అంధుడే పుట్టు' నని పలికినది. ఆయప్రియభాషణము తనకు, తన వారికి ఎన్నో కష్టములకు కారణమైనది. చరిత్రను పరిశీలించిన యిట్టి అజ్ఞాన వాక్కుల వలన దేశములకు దేశములే నశించిపోయినవని స్పష్టమగును. ప్రతి వారిలోను నిట్టి చిన్న, పెద్ద అనుభవములు కొన్ని యైనా యుండక పోవు.

మనువు తన ధర్మశాస్త్రములో వాణిలో నాలుగు దోషము లుండునని చెప్పెను–

"పారుష్య మనృతం చైవ పైశున్యం చాపి సర్వశః ।
ఽసంబద్ధ ప్రలాపశ్చ వాఙ్మయం స్యా చ్చతుర్విధం" ॥
(మనువు 12-6)

వాణిలోని దోషములు నాలుగు. మొదటిది (పారుష్యం) కఠిన వచనములు, రెండవది (అనృతం) అబద్ధము చెప్పుట, మూడవది (పైశున్యం) అన్ని రకముల మోసములు, నాలుగవది (అసంబద్ధ ప్రలాపము) వ్యర్థములైన వాక్కులు.

ఇట్టి దోషములు మిత్రులను కూడా శత్రువులుగా మార్చును. కనుక బుద్ధి యనెడు జల్లెడతో వాణిని శుద్ధ పరచి ప్రయోగించవలెను. ముఖ్యముగ సామాన్య జనుల కుపదేశించు ఉపదేశకుడు తన వాణిని చాలా జాగ్రత్తగా ప్రయోగించ వలసి యున్నది. లేకున్న గొప్ప ప్రమాదము సంభవించును. మను ధర్మశాస్త్రము ధర్మోపదేశకులనిట్లు హెచ్చరించుచున్నది.

"అహింస యైవ భూతానాం కార్యం శ్రేయానుశాసనం ।
వాక్చైవ మధురా శ్లక్ష్ణా ప్రయోజ్యా ధర్మ మిచ్ఛతా ॥
(మనువు 2-159)

'విద్వాంసులైన ఉపదేశకులు ధర్మాత్ములై సర్వప్రాణి హితము కొరకు ఉపదేశించు చుండవలెను. అట్టి యుపదేశము వలన ప్రజలు ధర్మాత్ములు కావలెను. వారి యజ్ఞానము నశింపవలెను. ఎవరు తమ సత్యోపదేశముచే అధర్మము నెదిరించి ధర్మస్థాపన జేయుచుందురో అట్టి వారు ధన్యులు.' అట్టి ధర్మోపదేశకులనే యీ వేద మంత్రము 'సఖాయః'-సన్మిత్రులని చెప్పుచున్నది.

సభలో ఆకర్షణగా మాట్లాడ గలుగువారు తమ వాక్చాతుర్యముతో భాషా పటిమతో, యుక్తితో సభను రంజింప జేయుదురు. అట్టి వక్తలు సభను

తమ వైపు ఆకర్షింప జేసుకొందురు. వారిలో కొందరు స్వార్థపరులు సామాన్య జనులను తప్పుద్రోవ పట్టించి తమ స్వార్థమును నెరవేర్చు కొందురు. ఒక పార్టీ వారు వచ్చి తమ వాక్చాతుర్యముతో ప్రజలను తమ వైపు త్రిప్పుకొను నట్లే వివిధ సాంప్రదాయ గురువులు భక్తులను తమ తమ వలలో వేసుకొందురు. ఇట్టి వారిని సఖాయ సభ్యులు-సన్మిత్రులు అని చెప్పుటకు వీలులేదు. వీరు దుర్మిత్రులు - దుఃఖముల నిచ్చు మిత్రులు.

కనుక మిత మధుర సత్య వాక్కులతో ఐదవ అడుగు ముందుకు వేసి సన్మిత్రులను, భద్రమైన లక్ష్మిని (ఐశ్వర్యమును) పొందుదము రండు.

## మధుర భాషీ భవ - పంచ పదీ భవ

### సత్యమునే మధురముగా పలుకుదు

శ్లో॥ సత్యం బ్రూయాత్ప్రియం బ్రూయా న్న బ్రూయాత్సత్య మప్రియం।
ప్రియంచ ऽనృతం బ్రూయాదేష ధర్మస్సనాతనః॥

ఎల్లప్పుడు సత్యమునే పలుకవలెను. ఆ సత్యమును కూడ ప్రియముగా - మధురముగా పలుకవలెను. సత్యమును అప్రియముగా అనగా కఠినముగా, యితరుల మనస్సుల నొప్పించునటుల పలుకరాదు. అట్లని యితరులకు ప్రియము గలిగించ అసత్యము నెన్నటికిని పలుకరాదు. ఇదే సనాతన వైదిక ధర్మము.

–మనుస్మృతి *(4-33)*

# ప్రచేతసో భవ

## సోమరివై వినాశము నాహ్వానింపకుము

మోఘమన్నం విన్దతే అప్రచేతాః సత్యం బ్రవీమి వధ ఇత్ స తస్య ।
నార్యమణం పుష్యతి నో సఖాయం కేవలాఘో భవతి కేవలాదీ ॥
(ఋ. 10-117-6)

(పరమేశ్వరుడు ఈ మంత్రములో మానవులకు ఒక హెచ్చరిక జేయుచున్నాడు.) ఓ మానవులారా ! సోమరి కష్టపడకుండా అన్నమును (భోగములను) కోరును. అతడు తన హితైషులైన కుటుంబీకులకు గాని, తన స్నేహితులకు గాని ఆ అన్నము పెట్ట నిచ్ఛగించడు. అట్టివాడు అన్ని విధముల పతనమై పోవును. నేను సత్యము చెప్పుచున్నాను. ఇతరులకు పెట్టక తానొక్కడే భుజించువాడు అన్నమును కాక పాపమునే భుజించు చున్నాడు.

ఋగ్వేద దశమ మండలములోని 117వ సూక్తములో ధన, అన్న దానముల ప్రశంస గలదు. అందు ఈ ఆరవ మంత్రము సోమరి యొక్క మనస్తత్వమును, అతడు పొందు దుర్గతిని వివరించు చున్నది. లోకములో మానవ జీవనములో రెండు భాగము లుండును. ఒకటి కర్మ, రెండవది భోగము. తాను కొంత కాలము పరిశ్రమ చేయును. కొన్ని భోగముల ననుభవించును. అయితే ఈ రెండును సమానమా ? లేక ఒకటి ముఖ్యము రెండవది గౌణమా ? ఏది ముఖ్యము ? ఏది గౌణము ? అని ఆలోచించుట చాలా అవసరము. ఈ విషయమును తులసీదాసు తన కవితలో నీ విధముగా చెప్పి యుండెను—

కర్మ ప్రధాన్ విశ్వకర్ రాఖా
జో జస్ కరై సో తస్ ఫల్ చాఖా

అనగా 'కర్మయే ప్రధానమైనది. ఎవరు ఏ విధమైన కర్మలు చేయుదురో వారట్టి ఫలముల ననుభవింతురు. ఈ విషయమును మన నిత్య జీవితములో కూడా పరిశీలించ వచ్చును. ఉదాహరణకు– ఒక వ్యవసాయదారుడు రెండు ఎద్దులను సంపాదించును. వాటితో పొలములో కొంత పని చేయించును. తరుపరి ఇంటికి తీసుకువచ్చి మేతకు కొంత గడ్డి వేయును. ఆ యెద్దు కొంత పని చేయవలెను, కొంత భోగము ననుభవింపవలెను. ఈ రెండింటిలో పని ముఖ్యమా ? తిండి ముఖ్యమా ? తాను తిండి పెట్టు చున్నాడు కనుక పని జేయించునా ? లేక పని చేసినది కదా అని తిండి పెట్టునా ? ఈ రెండింటిలో నేది ప్రధాన అవసరము ? అని అతనిని ప్రశ్నించిన "నాకు పొలములో పనికి అవసరమున్నది కనుక నీ ఎద్దులను కొంటిని. వాటికి తిండి పెట్టక వాటితో పని జేయించుట అసంభవము కనుక తిండి పెట్టుచున్నాను. ఒకవేళ తిండి పెట్టకనే పని జేయించు నవకాశమున్న తిండి ఖర్చు తప్పును కదా ! ఇంకను మంచిది". అని చెప్పును. తాను ఎద్దులను కొనునప్పుడు కూడా తక్కువ తిండి తిని యెక్కువ పనిజేయు ఎద్దులనే కొనును. బాగా తిండి తిని పని జేయని యెద్దులను కొనుటకు ఎవరు ముందుకువత్తురు ? అందుచే కర్మయే ప్రధాన మగును.

కొందరు మరియొక రకముగా వాదించ వచ్చును. వారి వాదన ఇట్లుండును. లోకములో మానవు లందరు భోగముల ననుభవించుట కొరకే కర్మల యందు ప్రవృత్తులగుదురు. భోగములపై ఆశ లేకున్న కర్మలు చేయ నిచ్చగించరు. ఏలయన ఒక వైద్యుడు తనకు వైద్యము తెలుసునని చికిత్స చేయడు. డబ్బు కొరకు మాత్రమే చేయును. వకీలు తాను చక్కగా వాదించ గలుగుదును కదా యని వకాలతు చేయడు. ఫీజు కొరకే- భోగము కొరకే ఆ వృత్తి చేయును. లోకములో ఒక సామెత గలదు– "సర్వే గుణాః కాంచన మాశ్రయంతి" అన్ని సద్గుణములు-గౌరవములు బంగారమునే- ధనమునే ఆశ్రయించును." కాని ఈ వితండ వాదన దార్శనిక దృష్టితో సరియైనది గాదు.

ప్రసిద్ధ యూరోపియను దార్శనికుడు ప్లేటో తను రచించిన "రిపబ్లికొ" అను గ్రంథములో నీ సమస్యకు చక్కటి విశ్లేషణ యిచ్చి యున్నాడు. ఒక ఉపాధ్యాయుడు1,000 రూపాయలు జీతము తీసుకొను చున్నాడు గాన ఉపాధ్యాయుడని పిలువ బడుచున్నాడా? లేక చక్కగా విద్యార్థులకు బోధించగలడు గాన ఉపాధ్యాయుడని పిలువబడుచున్నాడా ? ఒక వైద్యుడు నెలకు కొంత సంపాదించుట వలన వైద్యు డనబడు చున్నాడా ? లేక రోగులకు చక్కటి చికిత్స జేయుట వలన వైద్యుడని పిలువబడుచున్నాడా ? ఉపాధ్యాయుడు కాని, వైద్యుడు కాని మరి ఎవరైనను కాని జీవిక (ధనార్జన) కొరకే ఆ వృత్తులు జేయుచున్నను ఇచట ధనార్జనయే (భోగమే) ముఖ్యమని జెప్పలేము. దనార్జనయే ముఖ్యమైన వ్యక్తివిశేషత యుండనే యుండదు. ఎక్కువ ధనార్జనాపరులనే ప్రజలందరు గౌరవించ (కోర) వలసి యుండును. కాని లోకములో ధనార్జనను బట్టి గౌరవించరు. ఒక రోగి వైద్యుని కొరకు వెదుకునపుడు ఏ వైద్యుడు ఎక్కువ ధనార్జన చేయుచున్నాడా? అని చూడడు. ఎవరు చక్కగా వైద్యము చేయగలుగువని చూచును. అట్లే ఉపాధ్యాయుని, న్యాయవాదిని ప్రజలు ఎన్నుకొందురు. సత్కరింతురు.

ఈ ప్లేటో విశ్లేషణ తులసీదాసు యొక్క భావనను సమర్థించు చున్నది. అతని కవితలోని విశ్వ పదమునకు పరమాత్మ పరముగా కాక విశ్వ మానవ పమాజ పరముగా ప్లేటో విశ్లేషించి యున్నాడు.

దీనిని బట్టి మనము భోగమును కర్మ యొక్క ఆధీనము చేయవలెనే గాని కర్మను భోగము యొక్క ఆధీనము చేయరాదు. ఎప్పుడును కర్మ ఆధార మగును. భోగము ఆధేయ మగును. ఆధారము లేనిది ఆధేయ ముండ జాలదు. అందుచేతనే పరమేశ్వరుడు ఈ మంత్రములో "మోఘం అన్నం విందతే అప్రచేతాః" – కష్టించకుండా అన్నము కోరు సోమరి మూర్ఖుడని చెప్పెను. అట్టి వాడు భోగమునకే ప్రాధాన్యత నిచ్చును. ఇది సృష్టినియమమునకు విరుద్ధము. పిల్లల కథలలో '–ఒక మూర్ఖ రాజు తన చీకటి నగరములో అన్ని వస్తువులు శేరు ఒకే ధరకు అమ్మవలెనని శాసనము చేసెనట. ఒక శేరు

కూరగాయలు, ఒక శేరు మిఠాయి కూడ ఒక్క పైసాకే అక్కడ అమ్ముచుండెడి వారట. అట్టి రాజును మూర్ఖుడిగా ఆ కథలో వర్ణించుట జరిగినది. ఆ రాజు ఎంత మూర్ఖుడైనను ఎంతో కొంత ధర తీసుకొనియే విలువైన వస్తువుల నమ్మించెను. అసలు ధర లేకుండగనే, ఉచితముగానే యిమ్మని శాసనము చేయలేదు. కాని, సోమరి అసలు మూల్యము చెల్లించకనే, ఏ మాత్రము పరిశ్రమించకనే అన్నము కోరును. కనుక అట్టివానిని పరమ మూర్ఖుడని చెప్పవలసి యుండును. విలువైన వస్తువునకే మనము ఎక్కువ ధర చెల్లించెదము కాని ధర ఎక్కువగా నున్న వస్తువును విలువైనదిగా నెంచము.

"సత్యం బ్రవీమి" అనగా సత్యమునే చెప్పుచున్నానని పరమేశ్వరుడు ప్రజల నీ విషయము వైపు ఎక్కువ ధ్యాన ముంచ వలసినదిగా హెచ్చరించు చున్నాడు. అందుచే దీనిని చిన్న విషయముగా తలంచరాదు. మన నిత్య జీవితములో మనకు తెలిసీ తెలియకనే ధర చెల్లించకనే మనకు కొన్ని సుఖములు లభించు చుండును. మన మనస్సు కూడ ఉచితముగా లభించిన బాగుండునను కోరిక కలిగియుండును. కాని దీని వలన కాలక్రమమున పెద్ద ప్రమాదమే సంభవించును. ఆ ప్రమాదమును గురించి పరమేశ్వరుని మాటలలో చెప్పవలెనన్నచో "వధ ఇత్ సతస్య" అటువంటి భావన 'వధ ఇత్' మరణము వంటిది. ఈ అప్రచేతభావన విశ్వవ్యాపకమైన సాంక్రామిక రోగము. దీని వలన మానవ జాతి అంతయు కొద్దో గొప్పో పీడింపబడుచునే ఉన్నది. దీనిని తీయటి విషము(Sweet Poision) తో పోల్చవచ్చును.

ఈ విషయమును మన నిత్య జీవితములో నెందరి యందో చూచుచున్నాము. సోమరులు నశించిపోవుటయే కాని బాగుపడిన వారెవ్వరును లేరు. పరమేశ్వరునకు సోమరులనిన ఎంతమాత్రము గిట్టదు. వెంటనే కాకపోయినను కాలక్రమమున వారు అన్ని విధముల నష్టమై పోవుదురు. కన్న తల్లి దండ్రులు కూడ ఎంతటి దుష్టుడునైనను భరించగలరు కాని సోమరి యైన కొడుకును భరించలేరు. సోమరులు తల్లిదండ్రుల ప్రేమకు కూడా దూరమగుదురు. ఇక మిగిలిన బంధువుల విషయము చెప్పనక్కరలేదు.

అందుచేతనే వేద మంత్రము "న అర్యమణం పుష్యతి" బంధువుల నెవ్వరిని పొందలేడు. బంధువులనే కాక స్నేహితులను కూడ అతడు పొందలేడు. "న సఖాయం పుష్యతి" అని హెచ్చరించు చున్నది. కష్టపడకుండా ఇతరుల అన్నమును తిని బ్రతుకువానికి స్నేహితులెవరుందురు? అట్టి వానిని చూడగానే అందరు వాని నుండి తప్పించుకొనుటకే ప్రయత్నింతురు.

లోక వ్యవహారములో కేవల స్వార్థపరుడు అభివృద్ధి గాంచలేడు. ఏ వ్యాపారము లోనైనను ప్రజల హితమును దృష్టిలో పెట్టుకున్నవాడే ఉన్నతిని బొందును. వినియోగదారుల అవసరాలను న్యాయముగా తీర్చు వ్యాపారినే ప్రజ లెన్నుకొందురు. ప్రజల అభిరుచులను గుర్తించియే మిఠాయి వ్యాపారి మిఠాయిలను తయారు చేయును. ప్రజల అభిరుచులను తెలుసుకొనియే బట్టల వ్యాపారి బట్టలను తెచ్చును. అట్టి వాని పైననే ప్రజలలో విశ్వాసము కూడ ఏర్పడును. మోసము చేయనివాని దగ్గరకే ప్రజలు వెళ్లుదురు. ఎవరు పది రూపాయలు తీసుకొని దానికి తగిన విలువైన వస్తువు నిచ్చెదరో అట్టి వ్యాపారి వ్యాపారము వృద్ధి యగును. ప్రజల వద్ద పది రూపాయలు తీసుకొని మూడు నాలుగు రూపాయల విలువైన వస్తువు నిచ్చువాడు "మోఘ మన్నం విందతే" ఆరు ఏడు రూపాయల అత్యాశను కలిగిన వాడగును. అటువంటి వ్యాపారి త్వరలోనే ప్రజల విశ్వాసము కోల్పోయి నష్టమును బొందును.

మరియొక చోట వేదము ఒక చక్కటి సూత్రము చెప్పును. "సత్యే నోత్త భితా భూమిః" ఈ భూమి-జగత్‌వ్యవహారము సత్యముపైననే ఆధారపడి యున్నది యని దీని భావము. సత్యము పలికి వ్యాపారము చేయుట చాలా కష్టమని అనేకులు భావింతురు. కాని ప్రాచీన భారతీయ శాస్త్రములన్నియు, చివరకు రాజనీతి మొదలైన గ్రంథములన్నియు కూడా సత్యమునకే యెక్కువ ప్రాధాన్యత నిచ్చినవి. సత్యము పలికిన వ్యాపారము పెరుగదనుకొనుట పొరపాటే. కొన్ని సంస్థలు తాము తయారు చేసిన వస్తువులలో నేవేవి యెంతెంత భాగము లున్నవో సత్యముగా ప్రకటించును. అట్టి కంపెనీలు యెప్పటికిని వృద్ధి జెందుచునే యుండును. కొన్ని సంస్థలు మోసముతోనే బ్రతుకు నారంభించును.

అవి ప్రకటించినది యొకటి ఆ వస్తువుల యందుండునది మరియొకటి. అట్టి సంస్థలు ఒకవెలుగు వెలిగి ఆరిపోవునే గాని వృద్ధి జెందలేవు. ప్రజల విశ్వాసమును బొందలేవు. ఇంగ్లాండు మొదలగు కొన్ని దేశములలో వ్యాపారములో కూడా సత్యసంధత యెక్కువగా కనబడుచున్నది. చివరకు పాలలోని నీటి శాతమును కూడ వారు ప్రకటించి అమ్మెదురు. అటువంటి సత్యసంధతను అనుసరించుట అందరకు అవసరమే. లేకున్న "మోఘ మన్నం విందతే అప్రచేతాః" మనము కూడా మూర్ఖులమే అగుదుము.

దీని కన్నను సూక్ష్మ విషయము మరియొకటి కలదు. మనకు తెలియకుండగనే యితరుల నుండి మనము కొన్ని లాభములను బొందుచుందుము. పరోక్షముగా వారి దానమును (ఉపకారమును) గ్రహించు చుందుము. అందుచే వారికి మనము కొంత ఋణపడి యుందుము. ఉదాహరణకు ఒక చీకటి సందులో మనము వెళ్ళుచున్నప్పుడు ఒకరి యింటిముందున్న దీపము మనకు దారి చూపించి గోతిలో పడకుండా చేసిన మనము ఆ యింటివారికి ఋణపడిన వార మగుదుము. వేసవిలో ప్రయాణించునపుడు ఒక ధర్మాత్ముడు ఏర్పరిచిన చలివేంద్రములో మనము మంచి నీరు త్రాగి ఉపశమనము బొందిన పరోక్షముగా మనము వారికి కొంత ఋణపడి యుందుము. ఏదైనా పొరుగూరు వెళ్ళినపుడు ఒక ఆశ్రమములో గాని ధర్మశాలలో గాని మనకు ఆశ్రయము లబించిన మన కెంతో ఆనందము కలుగును. ఇది కూడా పరోక్షముగా మనపై ఋణభారము వేయును. ఇట్టి ఋణ భారమును తీర్చుకొనుటకు ప్రతి వ్యక్తి యత్నించవలసియుండును. ఆ ప్రయత్నమునే దాన శీలత యందురు. అట్టి దానశీలత లేని వ్యక్తి "మోఘ మన్నం విందతే" ఊరకనే సుఖమును కోరువంటి అప్రచేతు డగును. అందుచే దానశీలత మానవుని అప్రచేతుడై నశించి పోకుండా కాపాడును. ఆంగ్లభాషలో నీ విషయమును స్పష్టపరచు నొక చక్కటి సామెత గలదు. "Charity is the Salt of riches" అనగా "దానము సంపదలను కాపాడు ఉప్పు". మామిడి కాయలను గాని, నిమ్మకాయలను గాని చెడిపోకుండా ఎక్కువ రోజులు నిలువ యుంచాలంటే వాటిని ఉప్పులో ఊర బెట్టాలి. అప్పుడే అవి చెడిపోకుండా

నుండును. అట్లే సంపదలనబడు కాయలను చెడిపోకుండా నిలువ ఉంచాలంటే దానమనే ఉప్పులో ఊరబెట్టాలి. అనగా దానము చేయుచుండుట వలననే సంపదలు నష్టమై పోకుండా నుండును. ఛాందోగ్యోపనిషత్తులో ధర్మమను పీట మూడు కాళ్ళపై నిలిచి యుండునని చెప్పబడినది. అందు మొదటి కాలు యజ్ఞ అధ్యయన దానములు. యజ్ఞము పరోక్షముగా చేయు దానము. అధ్యయనము దానము జేయవలసిన కర్తవ్యాన్ని గుర్తుచేస్తూ ఉంటుంది. దానము మనోవాక్కాయ కర్మలతో జేయు ప్రత్యక్ష క్రియ. ఇవి ధర్మపీఠానికి మొదటి స్తంభము. ఈ ఋగ్వేద సూక్తములోని మంత్రము లన్నియు ధన అన్న దానాదులను ప్రోత్సహించు చున్నవి.

చివరగా ఈ మంత్రము "కేవలాఘో భవతి కేవలాదీ - ఎవడు ఒంటరిగా తినునో వాడు కేవలము పాపమునే తినుచున్నా" డని చెప్పు చున్నది. మానవుడు కొందరికి పెట్టిన తరువాతనే తాను భుజింపవలెను. ముఖ్యముగ గృహస్థులు ఈ నియమమును విధిగా పాటించవలెను. గృహస్థుడు పంచ మహా యజ్ఞముల అనంతరముననే భుజించవలెనని శాస్త్రములు చెప్పుచున్నవి. సమయమంతా ధన సంపాదనలోనే వినియోగించక కొంత సమయమైనను పరమేశ్వర ప్రార్థనా ధ్యానాదులకు కేటాయించుకొని బ్రహ్మయజ్ఞం చేయాలి. జల వాయువులను తద్వారా అన్ని పాకృతిక శక్తులను సంస్కరించుటకు అగ్నిహోత్రమనే దేవయజ్ఞం చేయాలి. జన్మ నిచ్చి పెంచి పెద్ద జేసిన తల్లిదండ్రులకు సపర్యలు జేసి వారికి తృప్తిగా భోజనమిడి పితృయజ్ఞం చేయాలి. తదుపరి వీధిలోనికి వచ్చి ధర్మోపదేశము జేయుచు దేశ సంచారము జేయు అతిథులను, సంన్యాసులను ఒకరినైనా తీసుకు వచ్చి సత్కరించి అతిథియజ్ఞం జేయాలి. తదుపరి తనను ఆశ్రయించు కొనిన ఆవు, కుక్క మొదలైన జంతువులకు, సేవకులకు ఆహార మొసగి బలి వైశ్వదేవయజ్ఞం చేయాలి. ఈ పంచ మహాయజ్ఞాలు చేసిన తదుపరి మాత్రమే గృహస్థుడు భోజనం చేయాలి.

శ్లో ॥ యజ్ఞ శిష్టాశినః సంతో ముచ్యంతే సర్వ కిల్బిషైః ।
భుంజతే తే త్వఘం పాపా యే పచంత్యాత్మ కారణాత్ ॥
(భ. గీ. 3-13)

ఆ పంచ మహాయజ్ఞాలు చేసిన తదుపరి మిగిలిన ఆహారము సర్వపాపముల నుండి మానవుని విముక్తుల జేయునని కృష్ణుని ఉపదేశము. ఇంతేగాక, ఎవరు తమ కొరకే అన్నాదులను పక్వము జేసికొందురో ఆ పాపాత్ములు పాపమునే భుజించిన వారగుదురనియును హెచ్చరించెను. "ఇష్టం చ వా యేష పూర్తం చ గృహాణా మశ్నాతి యః పూర్వే రతిథే రశ్నాతి (అథర్వ 9-6-(3)-1)" తన వారితో బాటు మరియొక అతిథికి అన్నము పెట్టక తాను భుజించు గృహస్థుడు ఇష్టపూర్తములైన సమస్త సంపదలను గోల్పోవు నని అథర్వవేదము చెప్పుచున్నది. కాన ప్రతి వ్యక్తి తనకు తన కుటుంబము కొరకే గాక, మరి కొంత మందికి పెట్టగలుగునట్లుగా అన్నము సంపాదించవలెను. యజుర్వేదములో "నాకు ముందు వెనుక అన్ని వైపుల అన్న రాసులున్నవి. వాటి మధ్య నేను అన్నదాతనై వెలుగొందెదను గాక" యను నొక చక్కటి ప్రార్థన గలదు. ఇది గృహస్థులందరికి అనుసరణీయము.

దానశీలుడు దేవత యగును. ఆ దానము శ్రద్ధతో నిచ్చుట ఉత్తమము. దాన శీలత లేని వ్యక్తికి దానమిచ్చుటకు ప్రారంభమున మనసొప్పదు. ఇతరుల బలాత్కారముచే శ్రద్ధ లేకున్నను కొంత దాన మిచ్చును. అట్లు శ్రద్ధ లేకున్నను దాన మిచ్చుటయు మంచిదే యగును. ఏలయన కాలక్రమమున అది యాతనిలో దాన ప్రవృత్తిని కలుగ జేయును. అందుచేతనే శాస్త్రములు "శ్రద్ధయా దేయం, అశ్రద్ధయా దేయం, శ్రియా దేయం, హ్రియా దేయం, భియా దేయం, సంవిదా దేయం"– (తై.ఉ.వ. 11-3) శ్రద్ధతో నివ్వలేకున్న అశ్రద్ధతో నైనను, భయముతోనైనను దాన మిచ్చుటయే మంచిదని చెప్పుచున్నవి.

కనుక వేదము సూచించు ఈ పురోగమన (క్రాంతి) మార్గమున సోమరితనమును వీడి ప్రచేతసులమై ధన అన్న రాసులను బొందుదుము గాక! మనము తృప్తిగా తిని పది మందికి పెట్టుచు చక్రము వలె పురోగమింతుము రండు !

## ప్రచేతసో భవ - షట్పదీ భవ

# ఋణ విముక్తో భవ

## అప్పులపాలై ప్రభాత ప్రశాంతతను గోల్పోకుము

"పరాఋణా సావీరథ మత్కృతాని మాహం రాజన్నన్యకృతేన భోజమ్।
అవ్యుష్టా ఇన్ను భూయసీ రుషాస ఆనోజీవాన్ వరుణ తాసుశాధి ॥"
(ఋ. 2-28-9)

ఓ వరుణదేవ! ప్రపంచ పరిపాలక పరమేశ్వరా! నేను చేసిన ఋణ భారముల నుండియు నా కొరకు నితరులచే జేయబడిన ఋణ భారముల నుండియు నన్ను విముక్తుని జేయుము. నేను ఇతరుల కష్టార్జితమును భుజింప నిచ్ఛగింప కుందును గాక! ఋణ భారముతో ఉన్న నాకు ప్రభాత ఉషఃకాంతులు కాంతి విహీనము లగుచున్నవి. నన్ను ఋణ విముక్తుని జేసి ప్రభాత ఉషస్సుల ఆనందమును గ్రోల జేయుము.

ఇది ప్రార్థనా మంత్రము. అయినను ఇందు గొప్ప ప్రేరణ గలదు. ఈ మంత్రములో పరమేశ్వరుని 'వరుణ' పదముతో సంబోధించుట జరిగినది. 'వరుణు'డనగా శాసకుడు. రాజువలె పరమేశ్వరుడు ఈ ప్రపంచమును శాసించు చుండును. అతడు మనకు మిత్రుడు కూడ. స్నేహితుని వలె మన మేలు కోరుచు మనకు సాయము చేయును. శాసకుడు మిత్రు డెట్లు కాగలడు? అను ప్రశ్న ఉదయించును. వేదములో తరచు 'మిత్రా వరుణ' పదములు (శం మిత్రా వరుణా) వచ్చును. బ్రాహ్మణాది గ్రంథములలో వీటికి విస్తృత వివరణ గలదు. యజ్ఞ క్రియలలో నీ దేవతలకు ఆహుతు లిచ్చుటలో కూడ భేదము వివరింపబడినది. అందు మిత్రదేవత కొరకు 'నామ్బ' ధాన్యముతో ఆహుతు లిచ్చు విధానము గలదు. నామ్బ ధాన్యము (వెదురు బియ్యము వంటి ధాన్యము) అడవిలో వ్యవసాయము చేయకనే వాటంత టవియే పండును. అవసరమైన వారు అడవికి వెళ్ళి మూల్యము చెల్లించకనే ఆ ధాన్యమును సేకరించు

కొనవచ్చును. అట్లే పరమేశ్వరుడు మనకొరకు మన్ను, నీరు, గాలి, సూర్య చంద్ర కిరణములు, అడవులు, పర్వతములు, నదీ, సముద్రములను సృజించెను. వాటిని అనుభవించుటకును మూల్యము చెల్లించ నక్కర లేదు. 'మిత్రాయ సత్యాయ' ఆ మిత్రుడు సత్యరూపుడు. తానెట్టి మార్పును జెందక గతిమాన జగత్తునకు, ప్రాణులకు నాధారమగు సత్యరూపుడు. కనుక నాతడు మనకు 'యుజ్యః సఖా' నిజమైన మిత్రుడు.

యవ ధాన్యము (బార్లీ వంటి ధాన్యము) భూమిని చదును జేసి, దున్ని, విత్తనములు చల్లి, నీరుపెట్టి కాపాడి పండించవలెను. దీనికి కొంత శ్రమ, ధనము అవసరము. భూమి శిస్తు, అమ్మకము పన్ను మొదలగునవి రాజునకు చెల్లించవలసి యుండును. వానిపై రాజశాసన ముండును. కాన అవి ఉచితముగా లభించవు. వాటికి తగిన మూల్యము చెల్లించవలసి యుండును. అట్లే యీ ప్రపంచములో నితరుల సహకారముతో, ప్రభుత్వ వ్యవస్థతో లభించు పదార్థములకు తగిన మూల్యము చెల్లించ వలసి యున్నది. ఇతరుల కష్టార్జితమును మూల్యము చెల్లించకనే అనుభవించిన ప్రభుత్వము శిక్షించును. పరమేశ్వరుడు కూడ ఇట్టి అపరాధమును క్షమించువాడు కాదు. రాజువలె అతనికి తగిన దండన విధించును. కావున పరమేశ్వరుడు వరుణుడు-శాసకుడు. 'వరుణాయ ధర్మపతయే' – అతడు ధర్మపతి. ధర్మముతో (సృష్టి నియమములతో) పాలించువాడు.

ఈ సృష్టిలో మనము అనుభవించుటకు అనేక భోగ్య పదార్థములు గలవు. కాని యీ ప్రపంచ మొక అంగడి వంటిది. ఇచట ప్రతి వస్తువు లభించును కాని దానికి కొంత మూల్యము చెల్లించవలసి యుండును. ఎవని వద్ద ధనము లేదో వానికి నిరాశయే మిగులును. కనుక అంగడికి వెళ్లునపుడు మన వద్ద పైస లున్నవో లేవో చూచుకొనవలెను. లేకున్న పైసలు సంపాదించి బయలుదేరవలెను. పైసలు లేక బజారుకు పోయిన మన కోరికలు బలవంతపెట్టి మనలను వివశులను జేసి దొంగతనమునకు ప్రేరేపించును. దాని వలన

మనము దుఃఖముల పాలగుదుము. కష్టించి సంపాదించని వ్యక్తికి ఋణభారము పెరుగును. ఋణము తీసికొని తిరిగి చెల్లించగోరని దివాలాకోరును ప్రజలు, ప్రభుత్వము క్షమించినను భగవంతుడు క్షమించడు. అత డా ఋణము నీ జన్మలో కాకున్నను జన్మాంతరమున తీర్చుకొన వలసి యుండును. కనుక ఈశ్వర భక్తుడు ఋణగ్రస్తుడు కాకుండ జాగ్రత్త పడవలెను. అనివార్య కారణముల వలన ఋణగ్రస్తుడైన చింతితుడై ఆ ఋణము తీర్చుకొనుటకు గట్టి ప్రయత్నము చేయవలెను. వాస్తవముగ ఋణగ్రస్తుడు కష్టముల పాలగుటయే గాక మనశ్శాంతిని కూడ గోల్పోవును. అత డెట్టి మానసిక అశాంతిని అనుభవించునో యీ మంత్రము చక్కగా వివరించు చున్నది.

"అవ్యుష్టా ఇన్ను భూయసీః ఉషాసః" - అతనికి దివ్యగుణములు గల ప్రభాత ఉషస్సులు కాంతి విహీనములై భయంకరముగా గోచరించును. ఉషస్సులనగా సూర్యోదయమునకు పూర్వము వచ్చు మంద ప్రకాశము. ఇవి ప్రాణులను జాగృత పరచును. వాటికి నవ చైతన్యమును ప్రసాదించును. అంత వరకు అంధకారములో మ్రగ్గిన జీవరాసులన్నియు నూతనోత్సాహముతో కేరింతలు కొట్టును. పక్షుల కిలకిలా రావములతో, లేగల అరుపులతో ఉషస్సులు ఆనంద మయముగా నుండును. కవులు ఈ ఉషఃకాల ప్రకృతి రమణీయతను వందల వేల శ్లోకములలో వర్ణించిరి. శారీరకముగా, మానసికముగా అలసట జెందిన మానవులు నిద్ర వలన ప్రశాంత మనస్కు లగుదురు. కాని ఋణగ్రస్తుడైన వాడు తెల్లవారుట చూచి భయపడును. నిన్న రాత్రి రేపు ఇచ్చెదనని వాగ్దానము చేసి అప్పుల వాండ్ల నుండి యెట్లో విముక్తిని పొంది ఒక రాత్రి గడప గలిగినను తెల్లవారగనే మరల అప్పుల వాండ్లకు నేనేమి సమాధానము చెప్పవలెనని చింతించు చుండును. ఎన్ని అవమానములు పాలుకావలెనో అని భయపడు చుండును. తనకు ఆనాడు తిండి కూడ లభించునో లేదో అని సందేహించు చుండును. అందుచే ఆ ఉషస్సులు 'అవ్యుష్టా' అతనికి కాంతి విహీనము లగును. అతను ఉషస్సుల నాహ్వానించ లేడు. దినము రాత్రి కంటెను ఘోర అంధకారముగా కనబడును. అత్యంత దీన వదనముతో భగవంతుని ప్రార్థించుచు

- హే భగవాన్! ఋణ గ్రస్తుడనై అన్ని విధముల సుఖ వంచితుడనైతిని. చేసిన కొద్ది కష్టము వడ్డీలకే సరిపోవు చున్నది. నన్ను ఋణవిముక్తుని జేయుము. మరల అప్పు జేయకుండు బుద్ధిని ప్రసాదించమని విలపించును.

అప్పు చేయక మన జీవన యాత్ర సాగునా? ఎంతటి వారైనను ఒకప్పుడు కాకున్న మరొకప్పుడైన అప్పు చేయవలసి యుండును. ఉన్నతి జెందిన ప్రతి వ్యక్తియు ప్రారంభములో అప్పు చేసియే యుండును. కోట్ల బడ్జెటును సమర్పించు ప్రభుత్వములే ప్రపంచ కోశము నుండియు, విదేశముల నుండియు అప్పులు చేయును. ఇక మనమెంత వారము? కాని తాను ఏ క్షణములోనైనను స్వల్ప ప్రయత్నముతో తీర్చ గలుగు అప్పులు అప్పులుగా గణనకు రావు. తన ఆదాయమునకు, ఆస్తికి మించి గట్టి ప్రయత్నము చేసినను తీర్చుకొనలేని అప్పులనే అప్పులుగా నెంచవలెను. అప్పు చేసిన వ్యక్తి, 'ఎలాగైనా అప్పు తీర్చి వేయాలి' అనే భావన కలిగి యున్నంత వరకు ఏ బాధయు నుండదు. ఏ కోశము ఐనను తానిచ్చిన అప్పు రాబట్టగలనను నమ్మకము కలిగి యున్నంత వరకు అప్పు ఇచ్చుటకు సంకోచించదు. ఆ నమ్మకము లేనప్పుడు కోశము గాని, అప్పులు ఇచ్చువాడు గాని అప్పు లిచ్చుటకు సిద్ధ పడరు.

అప్పులపాలై వడ్డీలకే సగము జీతముపైన కట్టుచు అవస్థలు పడు వారిని పరిశీలించిన వారి అప్పులకు వారి అజ్ఞానమే కారణ మనిపించును. వారు తమ ఆదాయమునకు మించి వ్యయము చేయుచుందురు. అట్టి వారిని నాలుగు వర్గములుగా విభజించవచ్చును. అందు మొదటివారు దుర్వ్యసనపరులు. వీరు ఒకటి రెండు వ్యసనములకు బానిసలై తమ సంపాదన యంతయు వాటికే వ్యయము జేయుచు అప్పులపాలై తమను తాము కష్టపెట్టుకొనుచు భార్యా బిడ్డలను కష్టములకు గురిచేయుదురు. అప్పుల వాండ్లతో అవమానములకు గురి యగుదురు. నికృష్ట జీవితము గడుపు చుందురు. ఇక రెండవ వారు సోమరులు. వీరు రెండు దినాలు పనిజేసి నాలుగు దినములు విశ్రాంతి గోరుచుందురు. ఆ కష్టము మరచిపోవుటకు మద్యము సేవింతురు. వెలయైన

ఆహారము తిందురు. ప్రతిదినము కూలికి వెళ్లరు. గుత్తా పని కావాలందురు. ఒక దినములోనే మూడు దినముల కూలి రాబట్ట గోరుదురు. పని మధ్యలోనే వదిలిపెట్టి పోవుదురు. వారికి అభిమానము కూడ ఉండదు. అప్పుల వారే వారి చుట్టు తిరుగుటకు విసుగు జెందుదురు. ఇక మూడవ వారు విలాస జీవితమును కోరువారు. వీరికి దుర్వ్యసనములు లేకున్నను వీరు ఆదాయమునకు మించి గొప్పగా జీవింప గోరుదురు. కంటికి మంచిదని చెప్పుచు సాధారణ టి.వి. బదులు రంగుల టి.వి. కొందురు. కూరగాయలు నిలువ ఉంచుటకు ఫ్రిజ్ కొందురు. వేసవిలో ఏర్ కూలర్, చలి కాలములో ఏర్ కండిషన్ కావలసి యుండును. చాలాకాలము మన్నునని ఖరీదైన వస్త్రములు కొందురు. ఒకపక్క వడ్డీలు కట్టలేక పోవుచున్నామని బాధ పడుచునే యేవో స్వల్ప కారణములు చూపించి మరల అప్పు జేసి విలాస వస్తువులను కొనుచుందురు. ఇక నాలుగవ వారు అభిమాన ధనులు. వీరు కష్టించి పనిచేయుదురు. మోసము చేయరు. విలాసములను కూడా కోరరు. అయినను విందులు గొప్పగా జేయగోరుదురు. గొప్ప గొప్ప బహుమతు లివ్వగోరుదురు. లేనిపోని బాధ్యతలను నెత్తిపై వేసికొందురు. తమ కుమార్తెలను గొప్ప యింటి (ఆస్తిగల వారి యింటి) కోడళ్లుగా జేయగోరుదురు. తమ కులములోనే బుద్ధిమంతుడైన పేదవానికి యివ్వగోరరు. అప్పులపాలై పైపైన బాగానే కనబడుచు లోలోన గొప్ప దారిద్ర్యము ననుభవింతురు.

ఈ నాలుగవ వర్గములోనే మరికొందరు అభిమానమునకు, విలాసములకు దూరముగా నుండగోరుదురు కాని, కుటుంబములోని వారు, బంధువులు, స్నేహితులు ఊరకుండరు. వారే అప్పులు తీసుకొని వత్తురు. బలవంతముగా ఋణ భారము పెంతురు. అందుచేతనే యీ మంత్రములో భగవానుడు 'అథః' పదము కూడా చేర్చినాడు. నా కొరకు పరులు జేయు ఋణ భారము నుండి కూడా విముక్తుని జేయుమని దీని యర్థము. పైన వివరించిన ఋణగ్రస్థులంతా ఆ ప్రభాత ప్రశాంతతకు దూర మగుదురు. ఆత్మ పరమాత్మల విచారణ జేయుచు అంతర్ముఖులై దివ్యానంద స్పర్శ పొందదగిన

ఆ దివ్య ఉషః కాలమున దుఃఖస్పర్శ ననుభవింతురు. కనుక మనమందరము వివేకవంతులమై ఋణములకు దూరముగా నుండవలెను.

"మాహం రాజన్ అన్యకృతేన భోజం" పై ఋణభారము నుండి దూరముగా నున్నను తనకు తెలియకనే మానవుడు మరొక ఋణము జేయుచుండును. అది సామాజిక ఋణము. ఇది చాలా సూక్ష్మమైన విషయము. శతపథ బ్రాహ్మణమునందు నాలుగు ఆధ్యాత్మిక ఋణ విషయములను గూర్చి చర్చించబడినది. అందు మూడు ఋణములు మానవ జన్మతోనే వచ్చుననియు, నాలుగవ ఋణము జీవిత కాలములో నేర్పడుననియు చెప్పబడినది. జన్మతోనే వచ్చునవి ఏవియన పితృ, దేవ, ఋషి ఋణములు. ఈ మూడు ఋణములు మన భుజములపై నున్నవని గుర్తుండుటకు మూడు ప్రోగుల యజ్ఞోపవీతము ధరింపబడు చుండుట అనాదిగా వచ్చుచున్న ఆచారము. మనను కని, పెంచి పెద్దజేసిన తల్లి దండ్రుల సేవించి పితృ ఋణమును తీర్చుకొనవలెను. మన శరీరము ద్వారా వెడలు మల, మూత్ర, నిశ్వాస, స్వేదాదుల ద్వారా జరుగుచుండు వాతావరణ కాలుష్యము నివారించుటకు నిత్యాగ్నిహోత్రము జేయుచు దేవ ఋణమునుండి విముక్తుల మగుచుండవలెను. ప్రాచీన ఋషి, ముని లందించిన ఏ జ్ఞాన విజ్ఞానముల ద్వారా నేడు మనము ఇన్ని సుఖముల ననుభవించు చున్నామో అట్టి జ్ఞానమును మనము పొంది దానికి మన అనుభవముల జేర్చి ముందు తరముల వారికందించుచు ఋషి ఋణమును తీర్చుకొనవలెను. పై మూడు ఋణములను యీ యజ్ఞోపవీతము సదా గుర్తు చేయుచుండును. ఇక నాలుగవ ఋణమైన సామాజిక ఋణమును గుర్తు చేయుటకు ధార్మిక చిహ్నము లేమియు లేవు. భౌతిక ఋణ భారములనుండి ముక్తుడై భగవద్ధ్యానము జేయగల వ్యక్తియే ఆ సామాజిక ఋణమును గుర్తించ గలుగును.

సామాజికఋణ మన నేమియో వివరించవలసి యున్నది. మానవుడు సంఘజీవి. జంతువుల వలె తా నొంటరిగా అడవులలోనో, కొండ గుహలలోనో

లభించినది తినుచు గడుపలేడు. సంఘములో తా ననుభవించు ప్రతి వస్తువు తోటి మానవుల శ్రమ ఫలితము. తరతరములు కూర్చొని తినుటకు తగిన ఆస్తి గలవారైనను ఇతరుల సహకారము లేనిది జీవించలేరు. తాను తిను ఆహారము ఎందరో మానవుల పరిశ్రమ ఫలము. తాను ధరించు వస్త్రము లెందరో మానవుల శ్రమ ఫలము. తానుపయోగించు ప్రతి వస్తువు వెనుక నెందరో మానవుల కృషి యుండును. కనుక పరోక్షముగ మానవుడు సమాజమునకు ఋణగ్రస్తు డగుచున్నాడు. ఈ ఋణ విముక్తికై లోకమున తాను కూడ తన వంతు కష్టము జేయవలసి యున్నది. అప్పుడే అతడు సామాజిక ఋణము నుండి ముక్తుడగును.

ఇంతేగాక ముందు మంత్రములో చెప్పుకొనినట్లు తోటి మానవుల నుండి మనము కొన్ని ప్రయోజనములు పొందుచున్నాము. ధర్మశాలలు, చలివేంద్రములు, ఇతరుల ఇంటి దీపములు, చెట్లు, సువాసనలు మొదలగు వాని వలన నితరుల నుండి మనకు కొంత సుఖము లభించు చుండును. కనుక కొన్ని పరోపకార కార్యములు జేసి ఋణ విముక్తులము కావలెను. ప్రభుత్వము నుండి మనకు కొన్ని సౌకర్యములు కలుగు చున్నవి. వాటికి పన్నుల ద్వారా మనము కొంత చెల్లించు చున్నను కొన్ని సందర్భములలో విశేష ప్రయోజనములు లభించు చుండును. కనుక మనము న్యాయముగా పన్నులు కట్టుటతో బాటు దేశోన్నతి కొరకు కొంత ప్రయత్నము జేయవలసి యుండును. ఇట్టి సూక్ష్మ ఋణముల నుండి కూడ విముక్తుల మైనప్పుడే ప్రభాత ఉషస్సులలో ప్రశాంతతతో బాటు పరమేశ్వర ధ్యానము జేసి దివ్యానందము నొంద గలుగుదుము.

ఈ ప్రపంచమును ఒక కర్మాగారముతో పోల్చిన అందు మనమంతా కార్మికులము. ఎవరి వంతు పని వారు జేసిన అధికోత్పత్తిని, వస్తునైపుణ్యతను సాధించ వచ్చును. ఎప్పుడు అందు కొందరిలో సోమరి తనము ప్రవేశించి సరిగా పనిచేయరో అప్పుడు కొన్ని యిబ్బందులు ఎదురగును. ఉత్పత్తి, నైపుణ్యత తగ్గిపోవు చుండును. యజమాని వివశుడై వారిపై చర్య తీసుకొన వలసి

యుండును. అట్లే యీ ప్రపంచ కర్మాగారాధిపతియైన వరుణుడు-పరమేశ్వరుడు సోమరులపై తన పాశములను బిగించక తప్పదు. అట్టి స్థితి రాకుండుటకై సద్బుద్ధి కొరకు ప్రార్థించుచు – "మాహం రాజన్ అన్యకృతేన భోజం" -. 'నేను యితరుల కష్టార్జితమును కోరకుందును గాక' అను గట్టి సంకల్పము చేసికొనుచుండవలెను.

చివరగా 'ఆ నో జీవాన్ వరుణ తాసు శాధి' – 'హే వరుణ దేవా! ఋణ భారముతో కాంతి విహీనమగుచున్న ప్రభాత ఉషస్సులలో వెలుగును నింపి కాపాడుము. నేను ఋణ విముక్తుడనగు శక్తిని, బుద్ధిని ప్రసాదింపు' మని భగవంతుని సహాయము నర్థించవలెను.

- పురుషార్థముతో కూడినదియే ప్రార్థన యనియు, పురుషార్థము లేని ప్రార్థన ప్రార్థన కాదనియు మన మిదివరకే తెలిసికొని యున్నాము. ప్రార్థన పురుషార్థ ప్రేరణ కొరకే యనునది వేద సందేశము. అట్టి వైదిక క్రాంతి పథమున మరియొక అడుగు ముందుకు వేసి పయనింతము రండు.

## ఋణ విముక్తో భవ - సప్తపదీ భవ

### ధనము రథచక్రము వలె తిరుగుచుండును

పృణీయా ధన్నాంధమానాయ తన్యాన్ద్రాధీయాం సుమను పశ్యేత పన్థామ్।
ఓ హి వర్తన్తే రథ్యేవ చక్రా న్యయమన్యముప తిష్ఠన్త రాయః॥
(ఋ. 10-117-5)

ధనము సమృద్ధిగా గలిగిన వ్యక్తి సత్పాత్రులైన యాచకులకు తప్పక దాన మొసంగవలెను. దూర దృష్టితో నాలోచించిన ధనము ఎచటను స్థిరముగా నిలువదు. ఒకరి వద్దనుండి మరియొకరి వద్దకు తిరుగుచునే యుండును. అందుచే నీ వద్ద ఉన్నపుడే దానమొసగి సుకృతము నార్జింపుము.

# వ్రతశీలో భవ

## ఈశ్వర సృష్టి నియమములను వీక్షించుము, వానిని అనుసరింపుము

విష్ణోః కర్మాణి పశ్యత, యతో వ్రతాని పస్పశే ।
ఇన్ద్రస్య యుజ్యః సఖా ॥ (ఋ. 1-22-19)

ఓ మానవులారా! సర్వవ్యాపకుడైన విష్ణువు యొక్క సృష్టి రచనా క్రియలను పరిశీలనతో దర్శించుడు. వాటిని అనుసరించి మీరు కూడా వ్రతశీలురు, కర్మశీలురు కండు. బ్రహ్మాండాధిపతియైన ఇంద్రుడే మీరు అనుసరించదగిన యోగ్యుడైన స్నేహితుడు.

ఈ మంత్రములో పరమేశ్వరుని 'విష్ణు' పదముతో సంబోధింప బడినది. విష్ణువనగా సామాన్య ప్రజల దృష్టిలో వైకుంఠాధిపతియైన దేవుడు. అతడు ఎన్నో అవతారములు నెత్తి దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ గావించు చుండు నని భావింతురు. కాని యీ భావన వేద సమ్మతము కాదు. వేదము పరమేశ్వరుని సర్వవ్యాపకునిగా చెప్పును. ముఖ్యముగా విష్ణు పదము సర్వవ్యాపకతను మరింతగా స్పష్టపరచును. మహర్షి దయానందుడు ఈ పదమునకు తన సత్యార్థ ప్రకాశ గ్రంథములో చక్కటి వ్యాఖ్యానము జేసియుండిరి. ఈ విష్ణు పదము 'విష్ణువ్యాప్తౌ' అను ధాతువునకు 'ను' ప్రత్యయము చేర్పుట వలన సిద్ధమగును. అందుచే 'వేవేష్టి వ్యాప్నోతి చరాచరం జగత్ స విష్ణుః' - చరాచర రూప సమస్త జగత్తు నందు వ్యాపించి యుండువాడు కావున పరమేశ్వరునకు విష్ణు వను పేరు వచ్చినది.

ఆస్తికులైన వారందరు ఈశ్వరుని సృష్టికర్తగా నంగీకరింతురు. సృష్టించుట యనగా చిన్న చిన్న అణు పరమాణువులను కొన్ని ప్రకృతి సూత్రములతో బంధించి వివిధ గుణములు గలిగిన వివిధ పదార్థములుగ నిర్మించుట. పరమాణువులలో గతి ప్రారంభమైనప్పటి నుండి ఆ స్థూల పదార్థ మేర్పడు వరకు జరుగు క్రియల సముదాయమునే సృష్టి యందురు. వీటన్నిటికి పరమేశ్వరు డొక్కడే కర్తగా నుండును. కుమ్మరివాడి కుండ నిర్మాణమునకును పరమేశ్వరుడు జేయు పదార్థ నిర్మాణమునకును నెంతో భేదమున్నది. కుమ్మరి పరమేశ్వరుడు

నిర్మించిన మట్టితో మాత్రమే కుండను నిర్మించగలడు. పరమాణువుల నుండి నిర్మించలేడు. ఆ మట్టితో బాటు మరికొన్ని పరికరములు కూడా కుండను నిర్మించుటకు అవసరమగును. అట్లే సాలెవారు, వడ్రంగులు, శిల్పకారులు పాక్షికముగానే కర్త లగుచుందురు. కాని పరమేశ్వరుడు తాను నిర్మించిన పదార్థము లన్నిటికి తా నొక్కడే సంపూర్ణకర్త.

కుమ్మరి తాను సృష్టించిన కుండలకు తాను రక్షకుడు కాలేడు. కాని పరమేశ్వరుడు తాను సృష్టించిన పదార్థము లన్నిటిని కాపాడుచుండును. కుమ్మరి కుండలను వెలుపట ఉండి నిర్మించు చుండును. అందుచే అతనికి కొన్ని పరికరములు,చేతులు అవసరమగును. పరమేశ్వరుడు పదార్థముల లోపల, వెలుపల సర్వత్రా వ్యాపించి యుండువాడు గావున అతనికి పరికరములతో పని లేదు. ఆస్తికులలో చాలామంది పరమేశ్వరుని సృష్టికర్తగా అంగీకరింతురు కాని సర్వవ్యాపకుడని అంగీకరించరు. అతడు సర్వవ్యాపకు డైనచో నీ సృష్టిలోని మంచి పదార్థములలోనే గాక మల మూత్రాది అశుద్ధ పదార్థములలో కూడా వ్యాపించి యుండవలసి వచ్చును గాన అది యిష్టము లేని ఆస్తికులు దేవునికి ఒక స్థానమును గల్పించి అచట పవిత్రముగా నుండునని నమ్ముచుందురు. క్రైస్తవులు నాలుగవ ఆకాశములో, మహమ్మదీయులు ఏడవ ఆకాశములో, వైష్ణవులు విష్ణు లోకములో, శైవులు కైలాసములో దేవు డుండునని నమ్ముదురు. నేడు నూతనముగా ప్రచార మగుచున్న బ్రహ్మకుమారి మతము కూడా ఈశ్వరుడు సర్వవ్యాపకుడని అంగీక రించదు. అతడు బ్రహ్మ లోకమున కూర్చుండి ఈ సృష్టిలోని సమస్త క్రియలను చేయునని నమ్మును. కాని వేదము "ఈశావాస్య మిదం సర్వం యత్కించ జగత్యాం జగత్" - ఈ జగత్తు నందలి కించిత్తు నుండి బ్రహ్మాండము వరకు అణువణువున లోపల, బయట ఈశ్వరుడు వ్యాపించి యున్నట్లు స్పష్టముగా చెప్పును.

వేదాంత దర్శన కర్తయైన వేదవ్యాసుడు పరమేశ్వరుని నిర్వచించుచు 'జన్మాద్యస్య యతః' అను సూత్రమును రచించెను. అనగా యెవ్వనిచే నీ బ్రహ్మాండము సృష్టిస్థితి లయములు పొందుచున్నదో అట్టి వాడు పరమేశ్వరుడు. సామాన్య ప్రజలు సృష్టి స్థితి లయములను సరిగా అర్థము చేసికొనజాలరు.

పరమేశ్వరుడు కొంత కాలము సృజించి తదుపరి ఆ విధముగా కొంత కాలము స్థిరముగా నుంచి కాపాడి చివరగా ప్రళయము చేయు ననుకొందురు. కాని సృష్టి స్థితి ప్రళయములు మూడును ఎల్లప్పుడు కలిసియే యుండును. ఇవి విడదీయ వీలు లేనివి. ఈ సృష్టిలో నిరంతరము ఎన్నో క్రొత్త స్థావర జంగమ ప్రాణులు సృజింపబడుచునే యున్నవి. ఎన్నో చక్కగా జీవించు చున్నవి. ఎన్నో కాల గర్భమున కలిసిపోవు చున్నవి. మానవులు తమ సీమిత బుద్ధితో చూచుట వలన ఇవి వేరు వేరుగా కనబడును. ఏ ప్రకృతి నియమములతో పగలు ఏర్పడునో అవే ప్రకృతి నియమములతో రాత్రి యేర్పడును. ఈ భూమిపైన కొంత ప్రదేశమును మాత్రమే చూడగల మనము సాయంత్రము ఆరున్నర గంటల వరకు పగలు ఉండుననియు ఆ తదుపరి రాత్రి వచ్చుననియు ననుకొందుము. రాకెట్ మొదలైన యంత్రముల సాయముతో భూమి నుండి చాలా దూరము పోయి భూమిని తిలకించినచో ఈ భూమిపై రాత్రి యెప్పటి నుండియో, పగలు ఎప్పటి నుండియో చెప్పజాలము. ఒక ప్రాంతమున పగలు మొదలగు చుండ మరియొక ప్రాంతమున రాత్రి మొదలగును. రెండును ఒకే సమయమున మనము చూడగలము. అందుచే ఈ సృష్టి, స్థితి ప్రళయములు నిరంతరము మహా ప్రళయము వరకు అనగా 432 కోట్ల సంవత్సరముల వరకు సర్వత్ర జరుగుచునే యుండును. ఈ క్రియ లన్నిటికి నేక మాత్రకర్త పరమేశ్వరుడు.

మరికొందరు ఆస్తికులు ఈ సృష్టిలోని పదార్థము లన్నియు నిర్మింపబడిన పదార్థము లైనను పరమేశ్వరుని కర్తగా అంగీకరింపరు. వారి దృష్టిలో దేవుడు ద్రష్ట మాత్రమే. కర్తృత్వము జీవులకు మాత్రమే ఉండుననియు, నీశ్వరుడు క్రియా శూన్యుడనియు, బంధన రహితుడనియు వారు నమ్ముదురు. వారే అద్వైతులు. వీరు చెప్పు ఈ యుక్తి అవైదికమే గాక సారహీనము, యుక్తివిరుద్ధము. క్రియాశీలతయే జడ చేతన పదార్థములను వేరు జేయును. ఈశ్వరునిలో క్రియాశీలత లేకున్న జడ పదార్థ మగును. చేతన పదార్థము క్రియావంతమై యుండ వలెను. సృష్టి నియమము ప్రకారము ఏ పదార్థమైనను నిర్మించిననే నిర్మితమగును కాని కేవలము దర్శన మాత్రమున నిర్మితము కాదు. అందుచేతనే మహర్షి దయానందుడు ఈశ్వరుని వ్యాఖ్యానించుటకు అతనిలోని యెన్నో గుణ కర్మ స్వభావములను వివరించవలసి వచ్చినది. అందు చివరగా పరమేశ్వరుడు

'సృష్టికి కర్తయునై యున్నా'డని స్పష్ట పరచెను. ప్రాచీన ఋషి ముని లందరు పరమేశ్వరుని సృష్టికి కర్తగానే అంగీకరించిరి. ఈ మంత్రము "విష్ణోః కర్మాణి పశ్యత" - విష్ణువు యొక్క కర్మలను చక్కగా వీక్షింపుమని ఉపదేశించు చున్నది. దీనిని బట్టియు విష్ణువు కర్మశీలుడని స్పష్ట మగుచున్నది.

ఇక 'పశ్యత' శబ్దమును గురించి విచారించ వలసి యున్నది. ఇచట పశ్యత అనగా కేవలము కన్నులతో చూచుట యని కాదు దర్శించుట యని అర్థము. దర్శించుట యనగా ఆ పదార్థమును గూర్చిన సంపూర్ణ జ్ఞానమును పొందుట. ఉదాహరణకు మనము ఇంటిలో ఏదో పనిలో నిమగ్నమై యున్నప్పుడు ఎవరో వచ్చి తలుపు తీయమన్నట్లుగా తలుపును తట్టిన సేవకుని పిలచి యెవరో చూడుమని చెప్పుదుము. ఆ సేవకుడు తెలివితక్కువవాడైనచో తలుపు తీసి చూచి యెవరో యొక మనిషి వచ్చినాడని చెప్పును. వాడు చూచి వచ్చినాడే కాని దర్శించి రాలేదు. ఆ సేవకుడు బుద్ధిమంతుడైనచో యజమాని భావమును అర్థము చేసుకొని వచ్చిన వ్యక్తి యెవరో, యే పని మీద వచ్చెనో తెలిసికొని వచ్చును. ఇదే దర్శించుట యగును. న్యూటన్, జేమ్స్‌వాట్ మొదలైన శాస్త్రవేత్తలు ప్రకృతిని దర్శించుట వలననే ఎన్నో విషయములు కనుగొన గలిగిరి. ఇచట 'పశ్యత' యనగా శాస్త్రవేత్తల వలె నీ సృష్టిని తిలకించుట. న్యూటన్ వలె "చెట్టు నుండి పడిన పండు భూమి మీదనే యెందుకు పడుచున్నది? పైకి ఎందుకు పోవుటలేదు? ఏ నియమము భూమిపై పడునట్లు చేయుచున్నది?" అని ఆలోచించ వలెను. అప్పుడే ఈశ్వరుని కర్మలను అర్థము చేసి కొనగలము. అతనిని సర్వవ్యాపకునిగా సర్వ శక్తిమంతునిగా, నిరంతర కర్మశీలిగా, నియమబద్ధ ఆచరణ శీలునిగా, పక్షపాత రహితునిగా, న్యాయకారిగా, దయాళువుగా, సృష్టికి ఏక మాత్రకర్తగా మనము సృష్టిని 'దర్శించుట' వలన అనగా చక్కగా చూచుట వలన మాత్రమే అర్థము చేసికొనగలము.

కేవలము అర్థము చేసికొనిన సరిపోదు. దర్శించి మన కర్తవ్యమును గుర్తించవలెను. లేకున్న మన దర్శనము ప్రయోజనకారి గాదు. రక్షక భటుడు ఒక దొంగ దొంగతనము జేయుచుండగా చూచి వీడు దొంగిలించు చున్నాడని అర్థము చేసికొన్నను అతనిని పట్టుకొని బంధించి జైలులో పెట్టక పోయిన అతని

దర్శనము వలన నేమి లాభము కలుగును? అందుచేతనే యీ మంత్రములోని తరువాత భాగము 'యతో వ్రతాని పస్పశే' అని చెప్పుచున్నది. ఏ విష్ణువుతో యీ సృష్టిలోని క్రియలన్నియు జరుగుచున్నవో వాటి నుండి వ్రతధారణ చేయవలెను. వ్రత మనగా తాను స్వయముగా వరించి స్వీకరించు మంచి కార్యము.

మంచి కార్యములను మన అనుకూలతను బట్టి తీరిక సమయములలో లేదా కాలక్షేపము కొరకు చేయుచుండిన సరిపోదు. వాటిని నియమముగా జేయుటకు దృఢముగా సంకల్పించవలెను. అట్టి దృఢ సంకల్పమునే వ్రత మందురు. దాని వలన మానవునకు చాలా యున్నతి కలుగును. వేదము ఈ విషయమును చాలా చక్కగా వివరించును -

వ్రతేన దీక్షా మాప్నోతి దీక్ష యాప్నోతి దక్షిణామ్ ।
దక్షిణా శ్రద్ధా మాప్నోతి శ్రద్ధయా సత్యమాప్యతే ॥
(యజు. 19-30)

వ్రతేన - ఒక మంచి పనిచేయ దృఢముగా సంకల్పించినపుడు దానిపై దీక్ష-పట్టుదల యేర్పడును. దీక్ష వలన దక్షిణ-అనగా సన్మాన పూర్వక లాభము కలుగును. దక్షిణ వలన (ప్రయోజనము కలుగుట వలన) దానిపై మరింత శ్రద్ధ కలుగును. శ్రద్ధ యేర్పడుట వలన సత్యము (ఆ వ్రత లక్ష్యము- లాభము) లభించును.

ఉదాహరణకు సంగీతము, నాట్యము, శిల్పము మొదలగు వానిలో నొక కళను గాని, వైద్యము, న్యాయవాదము, యంత్ర, గృహ నిర్మాణము మొదలగు వృత్తులలో నొక వృత్తిని గాని వ్రతముగా స్వీకరించి సాధన జేసిన ఆ కళలో లేదా ఆ వృత్తిలో సిద్ధిని (అగ్రస్థానమును) పొంద వచ్చును. అట్లే పరమేశ్వరుని కర్మలలో నొకటి రెండు కర్మలను వ్రతముగా స్వీకరించి సాధన జేసిన మనము ఈ లోకములో యున్నతి బొందుదుము. అంతేగాక మనకు పరమానంద (పరమాత్మ) ప్రాప్తి కూడా లభించును.

చివరిగా ఈ మంత్రము 'ఇంద్రస్య యుజ్యః సఖా' - జీవునకు పరమేశ్వరుడే యోగ్యమైన మిత్రు డని చెప్పుచున్నది. సర్వోత్తమమైన మానవ శరీరమును,

వికసించిన ఇంద్రియములను, ఇంద్రియార్థములను సృజించి యిచ్చిన పరమేశ్వరుని కంటెను మించిన మిత్రు డెవరుండును?

లోకములో మనము ఒకరి మైత్రిని గోరుదుమేని అతని అభిరుచులను తెలిసికొని మనము కూడ అట్టి అభిరుచుల నలవరచుకొనుటకు ప్రయత్నించ వలసి యుండును. అన్నిటినీ కాకున్నను కొన్నిటినైనా అలవరచుకొననిది అతని మిత్రత మనకు లభించదు. మనము ఎంత ఎక్కువగా అతని అభిరుచులను మనలో తెచ్చుకొందుమో అంత అతనికి సన్నిహిత మిత్రుల మగుదుము. ఒక వ్యక్తికి మరొక వ్యక్తితో మిత్రత యున్న యెడల కొన్ని విషయాలలోనైన వారిద్దరి అభిరుచులు ఒకటిగా నుండును. ఇది మిత్రతా నియమము. అట్లే పరమేశ్వరుని మైత్రిని గోరు మనము పరమేశ్వరుని గుణకర్మ స్వభావములను తెలిసికొని వాటిని అలవరచుకొనుటకు ప్రయత్నించవలెను. ఉదాహరణకు - పరమేశ్వరుడు నిరంతర కర్మశీలి. అతని సఖ్యత గోరు మనమును సోమరితనమును వీడి కర్మశీలురము కావలెను. పరమేశ్వరుడు న్యాయకారి అనగా న్యాయముగ జీవుల కర్మలకు ఫలముల నిచ్చును. కావున అతని మిత్రత గోరు మనమును పక్షపాత రహితముగ, న్యాయముగ వర్తించవలెను. అతడు దయాళుడు, అంతర్యామియై చెడు తలపులందు, చెడు కార్యములందు, భయాందోళనలు కలిగించి పాపకార్యముల నుండి దూరముగ నుండుటకు మనను ప్రేరేపించును. కష్టములు పాలు గాకుండా దయతో కాపాడును. పాపములకు శిక్ష కూడ తల్లి వలె దయతో నిచ్చును. అతని మిత్రత గోరుదుమేని మనము గూడ దయతో పాపులను, దరిద్రులను సంస్కరింప ప్రయత్నించ వలెను. అతడు ఈశుడు - నియామకుడు. సృష్టిలోని ప్రతి కార్యమును నియమ బద్ధముగ చేయుచుండును. మనమును మన పరిధిలో నియమ బద్ధముగ జీవితము గడుపవలెను. ఈ విధముగ సర్వ వ్యాపకుడైన పరమాత్ముని కర్మలను వీక్షిస్తూ వాటిని వ్రతములుగ స్వీకరించి పరమాత్మకు సన్నిహితులము కావలెను. కాన సృష్టి నియమములను చక్కగా దర్శిస్తూ పరమేశ్వరుని గుణకర్మలను తెలుసుకొని అట్టి వ్రతశీలురమై ముందుకు పోదము రండు.

## వ్రతశీలో భవ - అష్టపదీ భవ

# మననశీలో భవ

## మానవుడవై దివ్య మానవ సమాజమును నిర్మింపుము

తన్తుం తన్వన్ రజసో భానుమన్విహి జ్యోతిష్మత: పథో రక్ష ధియా కృతాన్ ।
అనుల్బణం వయత జోగువామప: మనుర్భవ జనయాదైవ్యం జనమ్ ॥
(ఋ. మం. 10, సూ. 53, మం. 6)

ఓ కర్మశీల మానవా! జీవనయాత్ర రూప సుందర వస్త్రమును నేయుచు ఆకాశములో గ్రహములతో గూడిన సూర్యుని అనుసరించి కర్మలు చేయుము. ఋషులు నిర్మించిన సంస్కృతీ సభ్యత లను వెలుగుబాటలను రక్షింపుము. మనన శీలుడవై దివ్య మానవ సమాజమును నిర్మింపుము.

మానవ జీవితము బహుమూల్యమైనది. పూర్వ మానవ జన్మలో జేసిన కొన్ని సుకృతముల ఫలితముగా ఈ మానవ జన్మ లభించినట్లు ఋషులు చెప్పుదురు. ఈ మానవ జన్మ కర్మయోని. ఈ జన్మలో జేసిన కర్మలే మానవునకు ఊర్ధ్వగతిని గాని, అధోగతిని గాని కలిగించును. పశు పక్ష్యాది యోనులలో (శరీరములలో) నిట్టి యోగ్యత లేదు. కొన్ని కర్మల ఫలము అనుభవించుటకే ఆ యోనులు (శరీరములు) ఏర్పడినవి. వాటిని భోగయోను లందురు. మానవ జన్మను పొందిన మనము కర్మలు చేయక క్షణమైనను గడపలేము. ప్రయత్న శీలత మానవుని స్వాభావిక లక్షణము. ఆహార నిద్రా భయ మైథునములు కర్మలుగా నెంచ బడవు. ఇవి జీవించుట కొరకు మాత్రమే ఉపకరించును. కొందరి జీవితములు వీటివరకే పరిమితముగా నుండును. అట్టి వారు ఆకారమున మనుష్యులైనను పశువులతో సమానమని పెద్దలు చెప్పుదురు. అట్లుగాక కొందరి జీవితములు ఒక మహదాశయము కొరకు పయనించినవై భావి తరముల కాదర్శముగా నుండును. వారిదే నిజమైన జీవిత మగును. ఈ మంత్రములో పరమేశ్వరుడు జీవితాశయము ఎట్లుండవలెనో,

ఆ ఆశయమును జేరుట కెట్లు పయనించవలెనో ఒక ఉపమానముతో చక్కగా తెలుపుచున్నాడు.

'తన్తుం తన్వన్' –దారములను నేయుచు. ఇచట మానవుడు పడుగు పేకలతో వస్త్రములు నేయు సాలె వానితో పోల్చబడెను. సాలెవాడు సుందరమైన వస్త్రమును నిర్మించుటకు చాలా కృషి చేయును. మంచి దూదిని సంపాందించి సన్నటి దారములను సిద్ధపరచును. ఆ దారములను ఎంతో ఓర్పుతో పడుగు పేకలుగా సిద్ధము చేయును. అట్లు సిద్ధపరుచు నపుడే రంగు రంగుల దారములతో అల్లికలోనే ఒక గొప్ప కళారూపము (డిజైను) వచ్చునట్లు తన పనితనమును జూపును. అదియొక సుందరమైన ఏక వస్త్రమైనను ఎన్నో దారములను బుద్ధితో దగ్గరగా నేయుటచే నిర్మితమైనది. అట్లే మానవులు తా మాచరించు కర్మలను సమన్వయపరచి నేర్పుగా కలిపిన నొక సుందరమైన జీవిత మను వస్త్రము సిద్ధమగును. ఆ వస్త్రములో మనము చేసిన పుణ్యాకర్మ లన్నియు ప్రకాశించుచు కనబడును. పాపకర్మలు నల్లగా ఆ వస్త్రము యొక్క అందమును చెడగొట్టుచుండును.

'రజసో భాను మన్విహి'– సుందరమైన జీవిత మను వస్త్రమును నిర్మించునపుడు మానవుడు ఆకాశములో గ్రహములతో పయనించు సూర్యుని అనుసరించవలెనని ఈ మంత్రము సూచించుచున్నది. సూర్యుని గురించి నేటి ఆధునిక విజ్ఞానము ఈ విధముగా చెప్పును– సూర్యుడు భూమికన్న దాదాపు 100 రెట్లు పెద్దగా నుండును. అచట హైడ్రోజను వాయువు హీలియం వాయువుగా పరివర్తన జెందుచు పెద్ద పెద్ద మంటలు లేచుచుండును. అచటి నుండి వెలువడు ప్రకాశము తన చుట్టు పరిభ్రమించు గ్రహ ఉపగ్రహములకు, అందలి ప్రాణికోట్లకు జీవనాధార మగును. ప్రాణికోట్లకు చైతన్యమును, స్ఫూర్తిని కూడా ఇచ్చును, ఆ విధముగ మానవుడు జీవిత మను అనంత ఆకాశములో సూర్యునివలె పయనించ వలసి యున్నది. ఉదయకాల సూర్యుడు భూమిపై నున్న అంధకారమును దూరము జేయుటకు తాను పైకి ఎగబ్రాకును. అట్లే యితరుల అజ్ఞానాంధకారమును బోగొట్టుటకు తా నున్నత మనస్కుడు

కావలెను. సూర్యుడు తానొంటరిగా పయనించుట లేదు. తన ఆకర్షణ శక్తితో మరికొన్ని గ్రహములను తనవెంట తీసుకొని వెళ్ళుచున్నాడు. వాటిని వాటి స్థానములోనే యుంచి వాటి పరిభ్రమణ కడ్డు రాకుండా తన వెంట తీసుకొని వెళ్ళుచున్నాడు. అట్లే మానవుడు తనకంటే తక్కువ స్థాయిలో నున్న తోటి మానవులను నడిపించుచు తన వెంట తీసుకొని వెళ్ళవలెను. వారిలో నున్న అవిద్య, అజ్ఞానము, దారిద్ర్యము మొదలగు చీకటులను తన విద్య, జ్ఞాన, సంపద లను ప్రకాశముతో పోగొట్టి వారిలో వెలుగును నింపవలెను. సూర్యుడు తాను తపించుచు లోకానికి మేలు చేయును. అట్లే మానవులు ఇతరుల మేలు కొరకు కృషిచేయు జీవితమును గడుపవలెను. ఇట్టివే మహోన్నతమైన ఉపమానము లెన్నియో వేదములందు గలవు. అవి వాటి కవియే సాటియని చెప్పవచ్చును. ఏ ధర్మ గ్రంథములోను ఇంతటి చక్కటి యుపమానములు గానరావు.

'జ్యోతిష్మతః పథో రక్ష ధియా కృతాన్' – ఈ మంత్రములోని ఈతరువాతి వాక్యము ఇంతకంటెను గొప్ప మహత్త్వము గలది. బుద్ధిశీలురైన ఋషులచే నిర్మించిన వెలుగు బాటలను రక్షించవలెనని దీని భావము. వేదాధ్యయనము జేసిన ప్రాచీన ఋషి మునులు భావి మానవ సమాజము పయనించుటకు కొన్ని విశాలమైన వెలుగుతో కూడిన సంస్కృతీ బాటలను నిర్మించిరి. అవే వర్ణాశ్రమ ధర్మములు, షోడశ సంస్కారములు మొదలగునవి. అవి ఎంతో విశాలముగా, దృఢముగా వేదాల వెలుగుతో నిర్మించబడినవి. ఆ మార్గముల వెంట బయనించు వారు క్షేమముగా గమ్యమును జేర గలుగుదురు. వాటిని తాను మరింత దృఢముగా, శుభ్రముగా నుంచవలెనే గాని చెడగొట్టరాదు. ఆ బాటల నుండి మానవులను తప్పు దారి పట్టించరాదు. ఆ బాటలు మంచివి కావని, తాను క్రొత్తగా నిర్మించిన బాటలే తేలికగా, తొందరగా, కష్టపడకుండానే లక్ష్యమును జేర్చునని చెప్పుట దుస్సాహసమే యగును. ఋషులు నిర్మించిన మార్గములు గమ్యమునకు సరళరేఖలుగా నున్నవి. గమ్యమునకు జేరుటకు సరళరేఖయే దగ్గర మార్గ మగును. సరళరేఖ కంటెను దగ్గర రేఖ జూపెద మనుట అజ్ఞానమే యగును. నేడు లోకములో అనేక సంప్రదాయములు వెలసినవి. ప్రాచీన ఋషి

మునులు ఏర్పరచిన వర్ణాశ్రమ ధర్మములను సరిగా నర్థము జేసికొనక, వారి మిడిమిడి జ్ఞానముతో విమర్శించి, 'మా దేవుడే గొప్ప, మేము జూపెడు మార్గమే అతి దగ్గర దారి' యని ప్రచారము జేయుచు ప్రజలను మోసగించు చున్నారు. అట్టి మోసగాండ్ర నుండి ప్రాచీన ఋషి ముని కృత మార్గములను రక్షింపుమని ఈ మంత్రములో పరమేశ్వరుడు ఆదేశించు చున్నాడు. ఏలయన ఆ మార్గములు "ధియా కృతాన్" బుద్ధితో నాలోచించి నిర్మించినవి. "జ్యోతిష్మత: పథ:" గోతులు గొప్పులు లేని, ప్రమాదములకు దారితీయని, వెలుగుతో నిండిన విశాలమైన బాటలు.

పై మార్గములతో బాటు మహా పురుషుల ఆదర్శమయ జీవితములు కూడ మనకు వెలుగుబాట లగును. ఏలయన మనుమహర్షి జీవనయాత్రలో ధర్మమార్గమును తెలుసుకొనుటకు నాలుగు మార్గదర్శక సూత్రములను చెప్పియుండెను. అందు సదాచారము మూడవది.

"వేద: స్మృతి: సదాచార: స్వస్వ చ ప్రియమాత్మన: ।
ఏతత్ చతుర్విధం ప్రాహు: సాక్షా ద్ధర్మస్య లక్షణం ॥
(మను. 2-17)

ధర్మ మార్గమును తెలుసుకొనుటకు మొదటగా అది వేదానుకూల మైనదో కాదో పరీక్షించవలెను. తదుపరి మనుస్మృతి మొదలైన గ్రంథములలో వివరించిన ధర్మమునకు అనుకూలముగా నున్నదో లేదో పరీక్షించవలెను. తదుపరి మహాపురుషుల జీవన సరళికి అనుగుణముగా నున్నదో లేదో పరీక్షించవలెను. చివరగా ఆ మార్గమున నడుచు చున్నప్పుడు అంతరాత్మ నుండి ప్రియమైన ప్రేరణ లభించు చున్నదో లేదో జాగ్రత్తగా గమనించ వలెను.

జీవితములో కొన్ని యొడిదుడుకుల వలన నిరాశా నిస్పృహలు ఆవరించినపుడు మహాపురుషుల జీవితములు మనలో గొప్ప ప్రేరణను కల్గించి ఆశా జీవులను, కర్తవ్య పరాయణులను జేయును. ఈ విషయమునే సుప్రసిద్ధ ఆంగ్ల కవి లాంగ్ ఫెలో తన కావ్య సరళిలో నీ విధముగా వర్ణించెను–

Lives of great men, all remind us
We can make our lives sublime
And departing leave behind us,
Foot prints on the sands of time,

Foot-prints that, perhaps, another,
sailing o'r life's solemn main
A forlorn and ship-wrecked brother
Seeing shall take heart again,

మహా పురుషుల జీవితములు మన కొక సత్యమును బోధించు చున్నవి. మనము కూడా వారి వలె కాలప్రవాహపు టిసుక తిన్నెలపై మన పద చిహ్నములను ముందు తరముల వారి కాదర్శముగా నుండునట్లు మలచుకొన వచ్చును. నిరాశా, నిస్పృహలలో చిక్కుకొనిన భావి తరములకు - దురదృష్టవశాత్తు ధ్వంసమైన నావ నుండి యెట్లో తీరము జేరిన జాలరికి జీవితాశను కలిగించునట్లు మన పద చిహ్నములను వదలి వెళ్ళవలెను.

'అనుల్బణం వయత జోగువా మపః'– న్యూనాధికములు గాక పూర్ణశక్తితో విరామము లేక కర్మలు చేయుడు. 'ఆ ప్రకాశించు ఆదర్శ కర్మలను విరామము లేక చేయవలెన'ని వేద భగవానుని హితోక్తి– కొందరు కొంత కాలము కొన్ని ఆదర్శ వంతమైన కార్యములను జేసి కొంతకాలము గాని, పూర్తిగా కాని విశ్రాంతి తీసుకొన గోరుదురు. కాని వేదము విరామము లేక చేయు మనుచున్నది. వస్త్రమును నిర్మించునపుడు దారములు తెగిపోవుచు, అతుకబడుచు నున్న ఆ వస్త్రము సుందరముగా నిర్మితము కాదు. అట్లే కొన్ని గొప్ప కార్యములు కొంత కాలము చేసి కొంత కాలము స్తబ్దతతో నుండి మరల ఆ కార్యములను జేయుట ఆదర్శముగా నుండదు. అలసట తీరుట కొరకు మాత్రమే విశ్రమించవలెను కాని మరియొక కారణముతో విశ్రమించరాదు. మరియొక చోట వేదములో పరమేశ్వరుడు "కుర్వన్నే వేహ కర్మాణి జిజీవిషేత్ శతం సమాః" (యజు.40-2) మానవులు కర్మల నాచరించుచునే నూరు సంవత్సరములు జీవించ గోరవలెనని

ఉపదేశించును. మూడవ, నాలుగవ ఆశ్రమములైన వానప్రస్థ, సన్యాసాశ్రమములు విశ్రాంతి తీసుకొనుట కొరకు గాదు. అప్పుడే సమాజ సంక్షేమము కొరకు విశేషముగా కృషి జేయవలసి యున్నది. వానప్రస్థులు తాపసిక జీవనము గడుపుచు గురుకులములను నడిపించవలెను. సంన్యాసులు సర్వసంగ పరిత్యాగులై దేశమంతట సంచరించుచు నెచట అన్యాయము, అధర్మము పెరుగుచున్నదో అచట నిర్భయముగా పక్షపాత రహితముగా ధర్మోపదేశము చేయవలెను. తన శరీరము కాపాడు కొనుటకైనను వెనుదీయక అన్యాయము నెదిరించుచు తాను ఆహుతి యగుటకు సిద్ధపడవలెను.

'మనుర్భవ' నీవు మనుష్యుడవు కమ్ము. తరువాత పరమేశ్వరుడు మానవులకు ఒక ఆణి ముత్యము వంటి సందేశ మిచ్చు చున్నాడు. ఆకృతిలో మన మందరము మనుష్యులమే. అందుచే నిచట ఈ పదము మరియొక గంభీరమైన అర్థము తెలుపుచున్నదని ఎంచ వలెను. మనుష్య పదమునకు మనన శీలుడని యౌగికార్థము. అనగా ఆలోచనా పరుడు యని. ఇచట మనిషి ఆలోచనాపరుడు కావలెనని పరమేశ్వరుని ప్రబోధము. ఈ యుత్తమ మానవజన్మ ఆత్మ, పరమాత్మల విషయము తెలుసుకొని దుఃఖసముద్రము నుండి తరించుట కొఱకు వచ్చినది. మానవుడు దుఃఖముల నుండి తప్పించు కొనుచు సుఖమయ జీవనము కొరకు విశేషముగా ప్రయత్నించు చుండును. మనుష్యుడు చేయవలసిన పరమ పురుషార్థము కూడా అదియే. మనకు కనిపించు ప్రపంచమేమి? నేనెవరు? ఈ ప్రపంచమును, తనను తన వశములో పెట్టుకొని నడపించు శక్తి యేది? అని ఆలోచించవలెను. తనకు అనివార్యముగా కలుగుచున్న దుఃఖములకు కారణమేమి? వాటిని తప్పించుకొను మార్గమేది? అని విచారించవలెను. ఈ జీవితములో తాను జేయవలసిన కర్తవ్య మేమి? ఏ మార్గమున నడచిన తన కున్నతి కలుగును? అని ఆలోచించవలెను. అది తెలుసుకొనుటకు కృషి చేయవలెను. శ్రుతి, స్మృతులలో నీ విషయము లన్నియు చక్కగా వివరింపబడినవి గాన వాటిని మననము జేయవలెను. ఈ విధముగా మననము జేయువాడే మనుష్యుడగును. ఈ మనన శీలత లేకపోయినచో మానవుడు తోకలేని జంతువే యగును.

ఉష్ణ ప్రకాశ గుణములు కలిగి యుండుట అగ్నికి ధర్మమగును. అట్లే మానవులు కలిగియుండవలసిన ధర్మములు-గుణములు పది యుండునని మనుధర్మశాస్త్రము చెప్పును.

"ధృతి క్షమా దమోऽ స్తేయం శౌచమింద్రియ నిగ్రహః ।
ధీర్విద్యా సత్య మక్రోధో దశకం ధర్మ లక్షణమ్ ॥"
(మనుస్మృతి 6-92)

'సదా ధైర్యము కలిగి యుండుట, నిందాస్తుతి మానావమాన హాని లాభముల యందు సహనము కలిగియుండుట, ఇంద్రియములను నిగ్రహించు శక్తిని కలిగి యుండుట, బుద్ధితో నాలోచించి సత్యా సత్యములను గ్రహించ గలుగుట, పృథివి మొదలు పరమేశ్వరుని వరకు గల పదార్థముల యథార్థ జ్ఞానమును కలిగి యుండుట, సత్యమును పలుకుట, క్రోధమును విడిచి పెట్టుట' యను పది గుణములు కలిగి యుండుట మానవ ధర్మము. ఈ గుణములు ఎంత యెక్కువగా కలిగియున్న నంత గొప్ప మనిషి యగును. వీటికి ఎంత దూరమైన అంత మానవత్వమునకు దూరమై పశుత్వమునకు దగ్గరగును. కావున పరమేశ్వరు డీ మంత్రములో నట్టి పది గుణములను మీలో ధారణ చేసికొనుచు మనుష్యులు కండని ఉపదేశించు చున్నాడు.

'జనయా దైవ్యం జనమ్'– దివ్య మానవ సమాజమును నిర్మింపుము. చివరగా చేయవలసిన ఒక ముఖ్య కర్తవ్య మున్నది. తాను మనుష్యుడై తదుపరి దివ్య మానవ సమాజమును నిర్మించవలసి యున్నది. తోటి మానవులలోని అజ్ఞానాంధ కారమును దూరము చేసి వారిని జ్ఞానవంతులుగా, కర్తవ్య పరాయణులుగా తీర్చి దిద్దవలసి యున్నది. అప్పుడే మానవున కున్నతి కలుగును.

నేడు ప్రపంచములోని ధార్మిక సంప్రదాయము లన్నియు తమ సంప్రదాయమే గొప్పదనియు, దాని ననుసరించుట వలననే ముక్తి కలుగు ననియు చెప్పుచున్నవి. మహ్మదీయులు వారి అనుయాయులకు మాత్రమే

ముక్తి కలుగునని చెప్పుదురు. క్రైస్తవులు కేవలము తమ మతము వారికి మాత్రమే ముక్తి కలుగునని చెప్పుదురు. కాని వేదము మీరు కేవలము మానవులైనప్పుడు మాత్రమే మీకు ఇహలోక, పరలోక యున్నతి కలుగునని చెప్పును. ఇంతటి విశాల భావములు మరే యితర మత గ్రంథములందును కానరావు.

మరొకచోట వేదములో పరమేశ్వరుడు "కృణ్వంతో విశ్వమార్యమ్" అను సందేశము నిచ్చి యున్నాడు. అనగా విశ్వమానవులను ఆర్యులుగా– ఉత్తమ మానవులుగా నొనర్చుడని దీని భావము.

మహర్షి దయానందుడు మానవులు వ్యక్తి పరముగా సామాజిక పరముగా ఉన్నతి బొందుట కొక చక్కని సూత్రము చెప్పియున్నాడు. అది వేదములలో జెప్పిన భావములనే ప్రతిబింబించును. "ప్రతి వ్యక్తియు తన యున్నతిలోనే సంతృప్తి నొందక అందరి యున్నతిలోనే తన యున్నతి కలదని తలంపవలె" ననునది. ఈ సూత్రమునే తాను స్థాపించిన ఆర్య సమాజ పది నియమములలో నొక నియమముగా నేర్పరచెను.

ముందుగా మనము మనన శీలురమై– ఆలోచనా పరులమై ధృతి క్షమాది పది మానవ ధర్మములను మనలో ధరించుకొని, తదుపరి దివ్యమానవ సమాజమును నిర్మింప శక్తి కొలది ప్రయత్నింతము రండు.

**మననశీలో భవ - నవపదీ భవ**

**మనుష్యుడు ఎవరు?**

'ఆలోచించనిదే ఏ పనినైనను చేయని వాడు మనుష్యుడు'

–మహర్షి దయానంద సరస్వతి
(ఆర్యోద్దేశ్య రత్నమాల)

# సంఘటనపరో భవ

## తోటి వానిని చేయి పట్టుకుని నడిపింపుము

సం గచ్ఛధ్వం సం వదధ్వం సం వో మనాంసి జానతామ్ ।
దేవా భాగం యథా పూర్వే సంజానానా ఉపాసతే ॥

(ఋ. 10-191-2)

'ఓ మానవులారా! మీరు కలిసి నడువుడు. కలిసి ప్రేమతో వార్తాలాపములు జేయుడు. కలిసి ఆలోచించుడు. ఒకరి నొకరు అర్థము చేసికొనుడు. పూర్వము ఉత్తమ మానవులు ఏ రకముగా పరస్పరము కలిసి మెలిసి సామాజిక యున్నతి కొరకు నిర్ణయములు తీసికొనిరో, వారి వారికి లభించిన ఉప భోగములతో సంతృప్తి జెంది కలిసి మెలిసి జీవించిరో అట్లే మీరును వారిని అనుసరించి యున్నతిని బొందుడు.'

ఈ మంత్రము ఋగ్వేదములో చివరి సూక్తము లోని రెండవ మంత్రము. ఈ చివరి సూక్తమునకు సంఘటనా సూక్తమని కూడా పేరు గలదు. ఇదే మంత్రము అథర్వవేదమున కొంత పాఠ భేదముతో వచ్చును. తైత్తిరీయ బ్రాహ్మణములో దీనికి చక్కటి వ్యాఖ్యానము గలదు. మానవ సంఘటన దేనివలన స్థిరపడునో ఆ విషయమము ఈ సూక్తమునందు జెప్పబడినది. ఈ మంత్రము ఋగ్వేదములోని అంతిమ సూక్తములో నుండుటచే ఋగ్వేద సారాంశముగా కూడ కనబడుచున్నది. ఈ మంత్రములోని 'సం గచ్ఛధ్వం, 'సం వదధ్వం', 'సం వః మనాంసి' అను పదములు మధ్యమపురుష బహువచనములో నున్నవి. కాన "మీరు - మీ నడక, మీ వాక్కు, మీ మనసు" అను అర్థములు వచ్చును. దీనిని బట్టి ఈ యుపదేశములు పరమేశ్వరుని నుండి మానవులకొరకు ఒసగబడిన వని గుర్తించవలెను. సంబోధన మనుష్యులకొరకే చేయబడునుగాని పశు పక్ష్యాదులు కొరకు కాదు గదా!

మానవుడు సంఘజీవి-సామాజిక ప్రాణి (Gregarious animal) అనగా నొంటరిగా కాక కొందరితో కలిసి జీవించ గోరును. ఇంతేగాక మానవుడు తన అవసరములకు మరి కొందరిపై ఆధారపడును. అన్ని పనులు తా నొక్కడే చేసికొన జాలడు. తాను తిను ఆహారమును కొందరు పండించి యివ్వవలెను. తాను నివసించు గృహము కొందరి సహకారముతో నిర్మింపబడును. తాను ధరించు వస్త్రములు మరికొందరి సహకారముతో సిద్ధమగును. అట్లే మానవులందరు ఒకరిపై నొకరు ఆధారపడక జీవన యాత్ర గడుపలేరు. వారు అందరి మధ్యలో గడుపుటకే ఎక్కువగా ఇష్టపడుదురు. జంతువులు మానవుల వలె గాక వాటంతట యవి జీవించగలవు. వాటికి దొరికినది తినుచు, అనువుగా నున్న చోట విశ్రాంతి తీసుకొనుచు జీవితమును గడుప గలవు. కొన్ని జంతువులు మందలు మందలుగా నివసించగోరినను అవి కేవలము స్వాభావిక గుణము వలననే అట్లు జేయును. వాటిని యొంటరిగా పెంచినను పెరుగ గలవు.

మానవులు కలిసి జీవించవలెను గాన వారు కొన్ని విధి నియమములకు కట్టుబడి జీవించవలెను. దానితోబాటు పరస్పరము ప్రేమతో కలిసి మెలిసి జీవించవలెను. వివిధ రకముల మనస్తత్వములు కలిగిన, వేరు వేరు అభిరుచులు కలిగిన, వేరు వేరు శక్తి సామర్థ్యములు కలిగిన మానవులు కలిసి జీవించుటకు పరమేశ్వరుడు ఈ మంత్రము ద్వారా కొన్ని మార్గదర్శక సూత్రములు చెప్పుచున్నాడు. ఏ జాతియైనను ఐకమత్యము లేనిదే వర్ధిల్లదు. ఐకమత్య మనగా కేవల మొక చోట గుమికూడుట కాదు. ఎంతమంది గుమికూడినను వారి యాలోచనా సరళి యొకటిగా నుండి పరస్పర ప్రేమ లేనిది లక్ష్యమును సాధించలేరు. సమాజ మనగా మనుష్యుల సమూహమని కాదు. వేలు లక్షలు కలిగిన మానవ సమూహము కన్నను అయిదు మందితో కూడిన వ్యవస్థా బద్ధమైన సమాజము గొప్ప కార్యములను సాధించును. ఈ మంత్రములో పరమేశ్వరుడు మానవులు ఒక సమూహముగా గాక, ఒక సమాజముగా జీవించవలెనని ప్రేరేపించు చున్నాడు.

దాని కొరకు మొదటగా మనము చేయవలసినది "సంగచ్ఛధ్వం" కలిసి నడువవలెను. కలిసి నడుచుటెట్లు సాధ్యము? ఒకరికి ఒక చోట పని

యుండును. మరి యొకరికి మరియొక చోట పని యుండును. ఒకరు విమానములో పయనించ మరొకరు రైలుపైననో, సైకిలు పైననో యేదియు లేకున్న కాలినడకనో పయనించు చుందురు. అవి వారి వారి శక్తి సామర్థ్యముల ననుసరించి యుండును. మరి కలిసి నడచు టెట్లు సాధ్యమగును? అను ప్రశ్న ఉదయించును. కాని, జాగ్రత్తగా నాలోచించిన రెండు రకములుగా మనము కలిసి నడచుట సాధ్యమగును. ఒకటి- వేరు వేరు శక్తి సామర్థ్యము లున్నను సైనికులు కలిసి నడచుట మనము చూచు చున్నాము. జాతీయ పర్వదినములలో, కొన్ని విశేష సమయములలో సైనిక వందనము జరుగుచుండును. అప్పుడు సైనికులందరు ఒక నియమము ననుసరించి కలిసి నడుచు చుందురు. అందందరి శక్తి యొక్కటిగా నుండదు. వారి బలా బలము లొకటి గాదు. అయినప్పటికి బలవంతుడు తన అడుగులు నియంత్రించి వేయుచుండును. బలము తక్కువగా గలవాడు ప్రయత్న పూర్వకముగా తన శక్తిని పెంచుకొని అడుగు ముందునకు వేయును. ఇది నియంత్రణ వలన సాధ్యమగుచున్న 'కలిసి నడచుట'.

ఇట్లే ప్రేమతో గూడ కలిసి నడచుట సాధ్యమగును. పెద్దవారు పిల్లలను నడిపించుకొనుచు షికారుకు తీసుకొని వెళ్లునప్పుడు ఇది అనుభవ మగును. పెద్దవారు శక్తి కలిగి నప్పటికి పిల్లవాని కొరకు తాము నెమ్మదిగా నడచు చుందురు. తమ చేయి పిల్లవాని కందించి ఉత్సాహపరచి నడిపించు చుందురు. పిల్లవాడు తనకు పెద్దవారంత శక్తి లేకపోయినను పెద్దవారి ప్రోత్సాహముతో, వారిచ్చు చేయి ఆసరాతో శక్తిని పుంజుకొని తొందరగా అడుగులు వేసి పెద్దవారితో కలిసి నడచును. దాని వలన నిద్దరికి ఆనందము కలుగును. ఈ మంత్రమున పరమేశ్వరుడు మీరు నియంత్రణతో గాక ప్రేమతోనే కలసి నడువవలెనని చెప్పుటకు 'స వదధ్వం' అను వాక్యమును జోడించినాడు. అనగా కలిసి ప్రేమతో మాట్లాడు కొనుచు ఒకరి కొకరు సహాయ పడుచు తండ్రి కొడుకుల వలె నడువవలెనని పరమేశ్వరుని అభిమతము.

తండ్రి యొంటరిగా వేగముగా నడచివెళ్ళుటకన్న కుమారుడు చెప్పు ముద్దు ముద్దు మాటలను వినుచు, అతనిని ప్రోత్సహించుచు నెమ్మదిగా

నడచుటలోనే యెక్కువ ఆనందమును బొందును. అట్లే తోటి మానవులలో నీ కంటె ఆర్థికముగా వెనుకబడిన కొందరికి నీ చేయి ఆసరాగా నిచ్చిన వారి కెంతో మేలు జరుగును. నీ కెంతో ఆత్మతృప్తి కలుగును. నీ విద్య కొందరి కాసరాగా నిలిచిన వారి జీవితములు వికసించును. నీ జ్ఞానము కొందరికి వెలుగును చూపిన నీ జన్మ ధన్యమగును. అన్యాయములో, ఆపదలో చిక్కుకొనిన తోటి మానవులకు కొందరికైనా నీవు సాయము చేయగలిగిన నీవు పరమేశ్వరునకు ప్రీతిపాత్రుడ వగుదువు.

తదుపరి పరమేశ్వరుడు "సం వో మనాంసి జానతాం" అని చెప్పు చున్నాడు. మీరు కలిసి ఆలోచించి యొకరి నొకరు అర్థము చేసు కొనుడని దీని భావము. అప్పుడే మనము ఒకరికి సాయము చేయగలుగుదుము. దాని కొరకు కలిసి ఆలోచించుట కూడా అవసరము. ఆ విధముగా కలిసి ఆలోచించునపుడే యొకరి నొకరు అర్థము చేసుకొన గలరు. ఒకరి నొకరు అర్థము చేసుకొనలేకపోవుటయే అన్ని వివాదములకు కారణము. దానితో మత భేదములు తలయెత్తి వాగ్యుద్ధముగా మారును. తరువాతనే అసలు యుద్ధము ప్రారంభమగును. కౌరవ, పాండవుల ఆలోచనలు మొదటి నుండియు భిన్నముగానే యుండెడివి. అందుచేతనే మయసభలో దుర్యోధనుడు పొరపాటున కాలుజారినంత మాత్రమున వెంటనే ద్రౌపది "అంధులకు అంధులు గాక మంచివారు పుట్టుదురా?" అని నోరుజారెను. ఆ యొక్క మాటయే భారత యుద్ధమునకు కారణమైనది. చిన్న చిన్న కలహములకు కూడా అభిప్రాయ భేదములే కారణము. ఈ భేదములు పోగొట్టుకొనుటకు పరస్పరము కలిసి మెలిసి విచారించు చుండుట యెంతైనా అవసరము. అందుకొరకే చర్చించు సభలు ఏర్పడినవి. ఆ చర్చలలో వారి వారి భావములను వ్యక్త పరచుటకు వీలగును. అప్పుడు ఒకరి నొకరు అర్థము చేసుకొని సమన్వయ మార్గ మొకటి అనుసరించ గలరు.

పైన వివరించిన ఆదర్శ సమాజ నిర్మాణమునకు మన మనుసరించ వలసిన ఒక యుదాహరణను పరమేశ్వరుడు చెప్పుచున్నాడు. "దేవా భాగం యథా పూర్వే"– 'మీ కంటె పూర్వము నివసించిన దేవతలు వారి వారి భాగముల

నెట్లు అనుభవించిరో అట్లే మీరు గూడా అనుభవింపుడు.' అనాది నుండి లోకములో దేవతలు, అసురులు అను రెండు తెగల మానవులున్నట్లు ప్రాచీన సాహిత్యము చెప్పుచున్నది. దేవత లనగా పరోపకార, త్యాగాది గుణములు కలిగిన ఉత్తమ మానవులు. వీరినే ఆర్యులని చెప్పుట జరిగినది. అసురు లనగా ప్రాణ పోషకులు. వీరు తమ స్వార్థము కొరకే ప్రయత్నించువారు . వీరిరువురిలో మనము దేవతల ననుసరించి ప్రాపంచిక సుఖముల ననుభవించవలసి యున్నది.

దేవతలు సుఖముల నేవిధముగా ననుభవింతురో శతపథ బ్రాహ్మణ మొక అలంకార రూపములో నిట్లు వర్ణించును - "ప్రజాపతియైన పరమేశ్వరునకు దేవతలు, అసురులు అను రెండు రకముల సంతాన ముండెను. దేవత లెప్పుడును పురుషార్థపరులై యొకరి కొకరు సహాయపడుచు కలిసి మెలిసి జీవించుచు నున్నతిని పొందిరి. అసురులు తమ స్వార్థము కొరకే ప్రయత్నించుచు, ఒకరి కొకరు అపకారము జేసికొనుచు పతనము జెందిరి. దేవతలకు యజ్ఞము అన్నము కాగా, అసురులకు స్వార్థము అన్న మయ్యెను. అప్పుడు ప్రజాపతి దేవతలను, అసురులను ఒక విందున కాహ్వానించి విందారగించుట కొక నియమము నేర్పరచెను. నియమము ప్రకారము అందరి మోచేతులు ముడుచుటకు వీలు లేకుండా కట్టెలతో కట్టివేయబడెను. ఆ కట్లను అట్లే యుంచి విందారగించవలె నని ఆదేశించెను. తొందర పడుచుండుటచే అసురులకు ముందుగా నవకాశ మిచ్చెను. అనుమతిచ్చినదే తడవుగా అసురులు విందారగించుటకు సిద్ధపడిరి. కాని చేతులు ముడుచు కొనుటకు వీలుపడక పోవుటచే చేయి నోటి వద్దకు వచ్చుట లేదు. చేయునది లేక ఆ పదార్థములను పైకెగురవేసి క్రింద నోరు జాపు వారు కొందరు, పడుకొని నోటితో తినుటకు ప్రయత్నించు వారు కొందరు కాగా నా ప్రదేశమంతయు చిందర వందర అయినదే కాని యెవ్వరును తృప్తిగా భుజించలేక పోయిరి. ఆ ప్రాంతమును శుభ్రము చేసిన తదుపరి దేవతలను విందుకు పిలిచెను. చేయి ముడుచుకొనక పోవుటచే వారు కూడా తినలేక పోయిరి. పరోపకార స్వభావము కలిగిన దేవతల కొక ఆలోచన తట్టినది. నేను తినలేక పోయినను ఒకరికి పెట్టుట కాటంకము లేదు గదా యను ఉద్దేశ్యముతో నొకరి కొకరు తినిపించు కొనుచు తృప్తిగా

భుజించిరి.' ఈ కథలో వలె ప్రాచీనులైన దేవతలు యజ్ఞమయ జీవనముతో పరోపకార పరాయణతతో ఎంతో యున్నతిని పొంద గలిగిరి.

దశరథుని కుమారులు దేవతలు. వారి రాజ్యరూప ఆహారము నొకరి కొకరు అర్పించుకొనిరి. రాముడు భరతుని కర్పించగా, భరతుడు రాముని కర్పించెను. తత్ఫలితముగా తరతరాల కాదర్శముగా నొక ఉత్తమ రాజ్యవ్యవస్థ యేర్పడెను. దీనికి భిన్నముగా షాజహాన్ నలుగురు కుమారులు రాజ్యరూప ఆహారము నంతా తా మొక్కరే భుజించవలెనని ప్రయత్నించిరి. చివరకు ఔరంగజేబు అన్నలను, తండ్రిని బంధించి రాజు కాగలిగెను. కాని ఆ రాజ్య మచిరకాలములోనే పతనమయ్యెను. ఇది మన చరిత్రలో కనబడు ప్రసిద్ధ ఉదాహరణము. అందుచేతనే పరమేశ్వరుడు 'యథాపూర్వే' - మీ ముందు తరముల దేవతల వలె త్యాగముతో భోగముల ననుభవింపుడని ఆదేశించు చున్నాడు. కావున మనము దేవతలనే అనుసరించవలసి యున్నది. మహర్షి దయానందుడు చెప్పినట్లు 'ప్రతి వ్యక్తియు తన యున్నతితోనే సంతృప్తి జెందక అందరి యున్నతిలోనే తన యున్నతి కలదని యితరుల మేలు కొరకు ప్రయత్నించవలెను.

ఇట్లు పరోపకారము జేయునపుడు ఒక విషయము జ్ఞప్తి యందుంచు కొనవలెను. 'సం జానానా' అనగా తోటివారు వెనుకబడి యుండుటకు కారణమేమో చక్కగా నర్థము జేసికొని కారణమును తొలగించుటకు ప్రయత్నించ వలెనే గాని గ్రుడ్డిగా నందరికి సాయము జేయుచు సోమరి తనమును పెంచరాదు. తోటి వారితో మనము వ్యవహరించు నపుడు అందరితో సమానముగా గాక, మహర్షి దయానందుడు చెప్పినట్లు 'ధర్మానుసారముగా, ప్రీతి పూర్వకముగా, యథా యోగ్యముగా' వ్యవహరించ వలెను. అప్పుడే మనము సమాజమును క్రాంతి మార్గమున నడిపించగలవార మగుదుము. నిత్య జీవితములో కూడా సదాచార పరులతో నొక రకముగాను, దుర్మార్గులతో నొక రకముగను వ్యవహరించుటలో తప్పులేదు. ఒక వ్యక్తి తన తండ్రితో నొక రకముగను, తన కుమారునితో నొక రకముగను వ్యవహరింపక తప్పదు. అట్లని వ్యవహరించు నపుడు ద్వేషముండరాదు. చెడుగుణములను ద్వేషించవలెనే గాని వ్యక్తులను

గాదు. ఈ విషయమున స్వామి వివేకానందుని వాక్యములు అనుసరణీయములు. వారు "ఓ మానవులారా! మీరు దొంగను కూడా ప్రేమించవలెను. కాని దొంగతనమును ద్వేషించ వలెను. దొంగతనమును ద్వేషింపకున్న అది మీలో కూడా ప్రవేశించు అవకాశమున్నది" అని ఆపదేశించెడి వారు.

తదుపరి దేవతల వలె మనము 'ఉపాసతే' ఉపాసనా శీలురమై జీవనయాత్ర సాగించవలెను. ప్రాణు లన్నిటిని పరమేశ్వరుని బిడ్డలుగా భావించి వారిని సేవించుటయే, సంస్కరించుటయే దైవోపాసనగా భావించి దేవతల వలె కర్మయోగులమై క్రాంతి మార్గమున పయనించవలెను.

ఈ సూక్తములోని మిగిలిన మంత్రములు కూడ సంఘటననే ఉపదేశించు చున్నవి. దీనిని బట్టి సమాజ ఉన్నతికి సంఘటన అనివార్యమని గుర్తించవలెను. నేడు సమాజములో కొన్ని ధార్మిక సంస్థలు ఈ విషయమును గుర్తించి దాని కొరకు ప్రయత్నించుట జరుగు చున్నది. అవి కొంత సాధించినవి. కాని వేద మార్గము ననుసరింపక పోవుటచే పూర్ణఫలము లభించుటలేదు. ముఖ్యముగ హిందువులని వ్యవహరింపడు భారతీయార్యుల సంఘటన ఎండమావిగానే కనబడుచున్నది. గణేశ నిమజ్జనాది ఉత్సవములు సంఘటనతో చేయుచున్నను అవి ఒక ఆవేశముతో ఏర్పడినవే కాని ఆలోచనతో కాదు. నేడు హిందూ దేశము అనేక సంప్రదాయములతో ముక్క ముక్కలుగా చేయబడినది. ఒకే పండుగను ఒకరు ఒక రకముగా, మరొకరు మరొక రకముగా జరుపుకొనుచున్నారు. వైష్ణవులు ఒకరోజు, శైవులు మరొకరోజు జరుపుకొను చున్నారు. చివరకు సంధ్యావందనాది నిత్య కర్మలు కూడ భిన్న భిన్నములుగానే యున్నవి. ఆరాధ్య దైవములు, ఆచార వ్యవహారములు, ధార్మిక చిహ్నములు వేరు వేరుగా నున్నవి. ఇవన్నియు నిలా ఉండగనే మనము హిందువులుగా ఒకటి కాగలమా? గణేశ ఉత్సవాదులు గ్రామాని కొకటి గాక వీధి వీధికి, ప్రతి చిన్న వీధికి ఒకటిగ జరుపబడుచున్నవి. ఇవి మనను సంఘటింప చేయగలవా? అనునది లోతుగా నాలోచించవలసిన విషయము.

కాని, ఇప్పటికిని మనము ఒక విషయములో సంఘటితము కాగలము. మనలో ఎన్ని సాంప్రదాయము లున్నను అన్ని సంప్రదాయములవారు వేదమును పరమేశ్వర వాణిగా నంగీకరింతురు. ఇంతేగాక వేదమునే పరమ ప్రమాణముగ

నంగీకరింతురు. కనుక వేద మతస్థులుగ మనము ఒకటి కాగలము. అయితే ఆ వేదమును సాంప్రదాయకులు వారి వారి కనుకూలముగ (వారి వారి సంప్రదాయముల కనుకూలముగ) వ్యాఖ్యానించు కొనుచున్నారు. వేదము యొక్క మూలభావమేమియో చాల మందికి తెలియరాకున్నది. సత్యము ఎప్పుడును ఒకటిగానే యుండును. మార్పులు చెందునది సత్యము కాజాలదు. మహర్షి దయానందుడు సూచించినట్లు భారతీయ సాంప్రదాయక గురువులందరు ఒక ధర్మవేదికపైకి వచ్చి, ప్రాచీన కాలము నుండి ఋషి ముని లనుసరించిన వేద వ్యాఖ్యానముల నంగీకరించి ఆ మార్గమున పయనించిన గాని మన జాతి సంఘటితము కాదు. ఎంత వరకు సంఘటితము కాదో అంతవరకు ఉన్నతి చెందజాలదు.

నేడు చాలా సంప్రదాయములు వేదమునకు భిన్నముగా నున్నవి. అవి తమది వేదానుకూలమే నను గట్టి నమ్మకముతో నున్నవి. ఆ మూఢ నమ్మకము నుండి బయటకు రాలేక పోవుచున్నవి. మహర్షి దయానందుడు చెప్పినట్లు 'సత్యమును గ్రహించుటకును, అసత్యమును త్యజించుటకును ఎల్లప్పుడు సిద్ధముగా నుండుటయే' ఆర్యలక్షణము. ఆర్యులు శాస్త్రీయ తర్కముతో సత్యమును గ్రహించవలెను. అసత్య మార్గమును త్యజించ వలెను. కనుక, అనార్యజుష్టమైన భాగ్యవాదాన్ని, సోమరితనాన్ని విడిచి పురుషార్థ పరులమై, కర్మయోగులమై మనను మనము సంస్కరించుకొనుచు పురోగమింతము రండు.

ఇక జాతీయ సంఘటన కొరకు ఆలోచింతము–అనేక భాషలతో, అనేక సంప్రదాయములతో, అనేక సభ్యతలతో, అనేక ఆచార వ్యవహారములతో నున్న హిందూ జాతియే గాక మహమ్మదీయులు, క్రైస్తవులు, బౌద్ధులు, జైనులు మొదలగు అనేక మతముల వారును ఈ దేశమున గలరు. ఐక్యత కొరకు ఎందరెంత ప్రయత్నించినను భేద భావములు పెంపొందుచునే యుండుట జూచుచున్నాము. ఇట్టి స్థితిలో సంఘటన ఎట్లు కలుగునని పెక్కురు సందేహింతురు. నిరుత్సాహము కూడా చెందుదురు. ఇట్టి సమయమున నిమ్న లిఖిత రాష్ట్ర గీతపు వేదమంత్ర మొకటి విచారణీయము–

జనం బిభ్రతీ బహుదా వివాచసం నానాధర్మాణం పృథ్వీ యథౌకసమ్ ।
సహస్రధారా ద్రవిణస్య మే దుహాం ధ్రువేవ రసపస్ఫురన్తీ ॥
(అథర్వ. 12-1-45)

"వివాచసం = అనేక భాషలు భాషించునదియు, నానాధర్మాణం = నానా ధర్మయుక్త జనులు గలదియు, యథా ఓకసమ్ = ఒకే గృహముతో సమానముగా ధారణ చేయదగినదియు నగు మాతృభూమి స్థిరముగా నిలబడి దుగ్ధధారలను పిండు గోవువలే ధనము యొక్క సహస్ర ధారలను నాకు ప్రసాదించును గాక!'

ఈ వేద సందేశము ననుసరించి "అనేక భాషలు, అనేక ధర్మములు కలిగిన ఈ దేశమంతయు ఒక గృహము వంటిది. అందు మనమందరమును ఒక కుటుంబము వంటి వారము" అను భావముతో స్వార్థమును విడచి రాష్ట్ర హితము కోరినపుడే జాతీయ సంఘటన జరుగ గలదు.

మన నిత్య జీవితములో ఏ చిన్న పని సాధించవలె నన్నను సంఘము (union) అవసరమగు చున్నది. సంఘటన (సంఘము) లేనిది ఒక చిన్న కర్మాగారములోని యజమానిని కూడ సంస్కరింప లేకపోవు చున్నాము. అట్లే ప్రజలు ప్రభుత్వ సహాయము పొందుటకు, ఉద్యోగులు తమ అవసరములు తీర్చుకొనుటకు, రాష్ట్రములు తమ హక్కులను బొందుటకు, చివరకు దేశములు తమను తాము రక్షించు కొనుటకు సంఘములుగా ఏర్పడక తప్పుటలేదు. ఈ సంఘటనకు పరమేశ్వరుని ఈ 'వైదిక క్రాంతి పథమే' (వేద మార్గమే) పూర్ణఫలప్రదమైనది.

కనుక మనస్సుతో ఒకరి నొకరు అర్థము చేసికొనుచు, వాక్కుతో ఒకరి నొకరు గౌరవించు కొనుచు, కాయముతో (శరీరముతో) కలిసి నడచుటకు అనగా పురోగమించుటకు పూర్ణపురుషార్థము చేయుదము రండు.

**సంఘటనపరో భవ - దశపదీ భవ**

# ఉపసంహారము

ప్రియ పాఠకులారా!

ఈ "వైదిక క్రాంతి పథము"ను చదివిన మీకు వేదోక్త పురోగమన మార్గమేదియో కొంత అవగతమై యుండును. ఇట్టి అమూల్య రత్నములు మరెన్నియో వేదములందు గలవు. సామాజిక విషయములే గాక ఆధ్యాత్మిక విషయములు, రాజ నైతిక విషయములు, వైజ్ఞానిక విషయములు, వైద్య, గణిత, జ్యోతిషాది విద్యలు, సంగీత నాట్యాది కళలు అందు గలవు. వేదములు సమస్త సత్య విద్యల గ్రంథములు. అవి ఈశ్వర వాక్కులు. ఆ మార్గమున నెమ్మదిగా పయనించినను ఆలస్యముగానైనను మన గమ్యమును చేరగలుగుదుము. తద్భిన్నమైన సంప్రదాయ మార్గములలో పరుగిడినను గమ్యమును చేరలేకపోవుటయే గాక ఇహ పర సుఖముల రెంటినీ గోల్పోవుదుము. ఈ విషయమునే శ్రీకృష్ణుడు ఈ విధముగా హెచ్చరించి యుండెను–

యః శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః ।
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్ ॥

(భ.గీ. 16-23)

ఎవడు శాస్త్ర విధిని– వేద విధిన (వేద విహిత ధర్మమగు విధి నిషేధములను) అనుసరింపక కోరికలకు దాసుడై ఆ మార్గముల పయనించునో అట్టి వాడు సిద్ధిని పొందలేక పోవుటయే గాక, ఇహలోక సుఖమును, పరమ గతియగు మోక్షమును పొందలేడు.

**తస్మాత్ 'వైదిక క్రాంతి పథే' పరోగమీ భవ**

